

Trabuco Canyon, CA - 92679 - U.S.A.
email : info@lordbalajimiracles.com
website: www.lordbalajimiracles.com
Phone : 949-459-3679

# శ్రీవారి లీలలు

## శ్రీ వేంకటేశ్వరస్వామి వ్రత మహాత్యం



లలిత ఋషికేశ్




ఋషికేశ్ నేహ లలిత



తేది : సెప్టెంబర్ 5, 2010



తేది : సెప్టెంబర్ 7, 2010



తేది : సెప్టెంబర్ 12, 2010



తేది : సెప్టెంబర్ 12, 2010



తేది : సెప్టెంబర్ 13, 2010



తేది : సెప్టెంబర్ 18, 2010



తేది : సెప్టెంబర్ 18, 2010



తేది : సెప్టెంబర్ 20, 2010



తేది : సెప్టెంబర్ 20, 2010



తేది : సెప్టెంబర్ 21, 2010



తేది : సెప్టెంబర్ 26, 2010



తేది : అక్టోబర్ 10, 2010

# శ్రీవారి లీలలు

అమెరికాలోని ఓ తెలుగు కుటుంబం ఇంట్లో శ్రీవారు చూపిన
యథార్థ సంఘటనల సమాహారము

## (శ్రీ వేంకటేశ్వరస్వామి వ్రత మహత్యం)




లలిత ఋషికేశ్

**Trabuco Canyon, CA - 92679 - U.S.A.**

email: info@lordbalajimiracles.com
website: www.lordbalajimiracles.com
**Ph: (001) 949-459-3679**

**శ్రీవారి లీలలు**

ప్రథమ ముద్రణ : శరత్పూర్ణిమ,
అక్టోబర్ 2010

ద్వితీయ ముద్రణ : డిసెంబర్ 2010.

**ఈ పుస్తకం భక్తుల కొరకు ఉచితముగా పంపిణీ చేయడం జరిగింది. ఈ పుస్తకం ఎవరికి డబ్బులకు విక్రయించరాదు.**

**ఉచిత డౌన్‌లోడికి :**
www.lordbalajimiracles.com/download

**ఉచిత కాపీలకు :**

అమెరికాలో


1. **Mrs. Lalitha Rushikesh**
Trabuco Canyon,
CA - 92679 - U.S.A.
Ph: (001) 949-459-3679
e-mail : info@lordbalajimiracles.com

ఇండియాలో

2. **Mr. V. Ganesh**
C/o. Orchid's, Casual Boutique,
Shop No. 20, Swapnalok Complex,
Secunderabad-500 003
Ph: 040-66322206, 9246272724
e-mail : ganeshvang@gmail.com

3. **Mr. B. Pulla Rao**
H.No.8-8-102/1, Riccob Bazar,
Khammam - 507011
Ph: 08742-244524, 9963958388

4. **M/s. Sree Rama Book Shop**
3-5-572, St.No.7, Vittalwadi,
Narayanaguda, Hyderabad- 500 029.
Ph: 040-66825299, 66752542
e-mail : srbs_gunfoundry@yahoo.com.



*Designed & Printed by :*

**Sree Rama Book Shop**






*ఓం నమో వేంకటేశాయ నమః*

# ముందుగా నా మాట

**వేంకటాద్రి సమం స్థానమ్ బ్రహ్మాండే నాస్తి కించన ।**
**వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి ॥**

*(సకల విశ్వములోనూ వేంకటాద్రికి సమమైన స్థానము లేదు. వేంకటాద్రిన నివసించే వేంకటేశ్వరునికి సమానమైన దైవము భూత భవిష్యత్ కాలాలలోనూ లేదూ, ఉండదు.)*

కలియుగంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహం పొందడానికి ఈ వ్రతము చాలా ఉత్తమమైనది. శ్రీవారి లీలలు, అద్భుతాల గురించి నేను అనేక విషయాలను వినడం జరిగింది. స్వామిని నా ప్రాణప్రదంగా కొలిచాను. ఆ స్వామి చాలా మహిమలు కలవారు. శ్రీవారు ఎంతో కరుణామూర్తులు, దయామయులు, నమ్మిన వారికి కొంగు బంగారమై, వారిని కష్టాల కడలినుంచి గట్టెక్కించే ఆపదమొక్కులవాడు. ఆయన తన భక్తులపట్ల అత్యంత ప్రీతి కలిగివుంటారు. ఆయన మీద పూర్తి భారం వేసి ధర్మపథంలో జీవితం గడిపే వారి బాధ్యత పూర్తిగా తానే వహిస్తారు. ఇందులో సందేహానికి తావులేదు.

నా తల్లిదండ్రులైన శ్రీ బూర్లె పుల్లారావు గారు, శ్రీమతి బూర్లె వెంకటలక్ష్మి గార్లు, శ్రీవారి గురించి నాకు ఎన్నో విషయాలను, లీలలను గురించి చెప్పేవారు. ఆ రకంగా శ్రీవారిపై ఎనలేని భక్తిప్రపత్తులను, ప్రేమను కలిగించారు. నేను పెరిగేకొద్ది ఆ స్వామిపై నాలో ఉన్న ప్రేమకూడా పెరగసాగింది. ఆ స్వామియే నాకు సర్వస్వం. నాకు తెలియకుండానే ఆ స్వామిపట్ల ఎనలేని భక్తి, ప్రేమ నా హృదయాంతరాలలో పెరగసాగింది. నా చిన్నప్పటినుండీ ఆ స్వామిని ఎన్నడూ ఏ కోరికనూ అడగలేదు. ఆయనను అంతలా ఆరాధించే నన్ను ఆయనే చూసుకుంటాడనే ధైర్యం రోజురోజుకూ నాలో బలపడసాగింది.

మనమందరం ఆ స్వామిని పూజిస్తాం. కాని మన మనస్సులో అనేక కోరికలతో ఆ ఆపదమొక్కులవాడిని ఆరాధిస్తుంటాం, పూజిస్తుంటాం. కాని కొంత మంది ఆయనను పూజించడమే కాక ఆయనను వారి వారి ఇళ్లకు ఆహ్వానిస్తారు. అలాంటివారికి మాత్రం ఆ స్వామి దివ్యసాక్షాత్కారం తప్పక లభిస్తుంది. ఈ రోజులలో భక్తి భావం తగ్గి స్వార్థం పెరుగుతోంది.





నాకు స్వయంగా ఆ స్వామి వారు సెలవిచ్చిన విషయాలను మీకు చెబుతున్నాను. ఏ ఇంట అయితే తల్లిదండ్రులు, అత్తమామలు, కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనవళ్ళు, మనవరాళ్ళు ఇలా ఇంటిల్లిపాది అప్యాయంగా, ప్రేమగా ఉంటారో వారి ఇంటికి ఆ ఏడుకొండలవాడు స్వయంగా వస్తారు. అంతేకాక అటువంటి ఇంటిలో శ్రీ లక్ష్మీదేవి ఆనందతాండవం చేస్తుంది. శ్రీవారు కోరికల విషయంలో ఈ విధంగా సెలవిచ్చారు. ప్రతి మనిషికి కోరికలు అనేవి సహజం, కాని కొంతమంది కోరికల వల్ల, మరికొంత మందికి హాని కలిగిస్తున్నారు. అటువంటి కోరికలు కాకుండా, సహజంగా మీ కోరికల వల్ల, ఇతరులకు ఎటువంటి హాని కలుగనటువంటి కోరిక తప్పక నెరవేరుతుంది. ఆ శ్రీనివాసునికి తన భక్తులంటే వల్లమాలిన అభిమానం, ప్రేమ, మన అహంకారాన్ని, ఈ ఇహలోక విషయాలపై మమకారాన్ని వదలి ఆ స్వామిని ప్రార్థిస్తే అన్నీ తానై చూసుకుంటాడు.

## స్వామివారితో నా అనుభవాలు

నా మాతాపితరులైన శ్రీ బూర్లె పుల్లారావుగారు, శ్రీమతి బూర్లె వెంకటలక్ష్మీగార్లు ప్రతీయేటా ఏడుకొండలు ఎక్కి స్వామి వారి దర్శనం చేసుకొనేవారు. మా తండ్రి గారికి ఆ శ్రీవారు అంటే వల్లమాలిన ప్రేమ, భక్తి. అది ఎంత అంటే వర్ణించనలవికాని భక్తిప్రపత్తులతో అనుక్షణం ఆయననే తమ మనస్సులలో నింపుకొనేవారు. వారి మూలంగానే నాకూ ఆ ఆపదమొక్కులవాడి మీద అత్యంత భక్తితో కూడిన ప్రేమ మొదలైంది. నేను ఖమ్మంలో 1980లో మా అమ్మమ్మ, తాతయ్య శింగవరపు అనంతరాములు, కోటిరత్నంగార్ల ఇంటిలో జన్మించాను. మా అమ్మమ్మగారు సనాతన సంప్రదాయవాది. ఎన్నో పూజలు చేసేది. నేను 2000 సంవత్సరంలో హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తూ అక్కడ హాస్టల్‌లో వుండేదాణ్ణి. ఒకరోజు తెల్లవారుఝామున ప్రకాశవంతమైన వెలుతురు. మనము కలలో కూడా చూడలేనటువంటి వెలుతురు. అందులోంచి నాకు ధ్వని (గొంతు(లో) మాట) వినిపించింది. స్వామివారు నాకు **"శ్రీ వేంకటేశ్వర స్వామి వ్రతం"** చెయ్యమని చెప్పారు. నేను వెంటనే కళ్ళు తెరచి చూసేసరికి అంతా చీకటి, ఆ తరువాత నేను కొంతమంది అయ్యగార్ల (పూజారి)ను అడిగాను. వాళ్లు మేమెప్పుడూ ఈ వ్రతం పేరు వినలేదు, మాకు తెలియదు అని చెప్పారు. ఆ తరువాత



కాలక్రమేణ నేను మరచిపోయాను. ప్రతి సంవత్సరం తిరుపతి నుంచి తిరుమలకు కాలినడకన వెళ్ళి అక్కడ స్వామి వారి గుడిలో అంగప్రదక్షిణ చేసేదాణ్ణి. కాని నాకెప్పుడూ ఆ వ్రతం గురించి గుర్తుకు రాలేదు. నేను పూర్తిగా మరచిపోయాను.

నాకు 2002లో వివాహమయ్యింది. వివాహం అయిన వెంటనే నేను యు.ఎస్.ఏ కు వెళ్లిపోయాను. స్వామి వారి అనుగ్రహంతో నాకు 2003న కూతురు **"నేహ"** జన్మించింది. తరువాత ఒకసారి మా కుటుంబంతో తిరుపతికి 2005లో వెళ్ళాను. నేను ప్రతిసారి అక్కడ అంగ్రప్రదక్షిణ చేస్తాను. అప్పుడు కూడ అలానే చేయాలని నిర్ణయించుకున్నాను. మేము ఉన్న ప్రదేశం గుడికి దూరం, నేను ఉదయాన్నే లేచి డబ్బులు తీసుకొని, బయటకు వచ్చి టాక్సీ కోసం చూస్తూ నడుస్తున్నాను. అప్పుడు ఒక గుఱ్ఱపుబండి నా ముందు ఆగింది, అందులోంచి ఓ వృద్ధుడు దిగి, నేను నిన్ను గుడికి తీసుకువెళ్తాను, నా గుఱ్ఱపుబండిలో కూర్చో అని చెప్పారు. నాకు అప్పుడు సమయం లేదు. కేవలం 10 నిమిషాలు మాత్రమే వుంది. పది నిమిషాలలో గుడికి చేరకపోతే నేను అంగప్రదక్షిణ చేయలేను. అప్పుడు నేను "తాత నేను నీతో రాను, నేను టాక్సీలో వెళ్తాను. అలా అయితే తొందరగా చేరగలను, నీ గుఱ్ఱపుబండిలో చాలా నెమ్మదిగా చేరతాము" అన్నాను. అప్పుడు ఆ తాత నవ్వి, "కంగారుపడకు నేను సరైన సమయానికే తీసుకుని వెళ్తాను. నీవు అంగప్రదక్షిణ చేయగలవు" అని చెప్పాడు. కాని అప్పటికీ నాకు ఏమీ తోచక ఆ గుఱ్ఱపుబండి ఎక్కాను. ఆ తాత నన్ను చాలా త్వరగా గుడికి తీసుకువెళ్ళి, అక్కడ కోవెలలో వున్న ఒక అమ్మకు నన్ను అప్పగించాడు. ఆ అమ్మ తేజస్సు దేదీప్యమానంగా వుంది. ఆ తేజస్సు ఈ రోజుకీ నా కళ్ళలో మెదులుతూనే వుంటుంది. చక్కగా ముఖానికి పసుపు రాసుకుని, పెద్ద కుంకుమ బొట్టు, ముక్కుకు రెండు ముక్కు పుల్లలు, ముక్కెర, తలనిండా పూలు ఆమెను చూస్తే అమ్మవారంటే బహుశా ఇలానే వుంటుందేమో అనిపించే విధంగా వున్నది. ఆమె నా చెయ్యి పట్టుకొని కోనేరులో మూడుసార్లు ముంచి నా ముఖానికి పసుపు, కుంకుమ రాసి, సూర్యదేవునికి పసుపు, కుంకుమ, పువ్వులతో పూజ చేయించింది. ఆ తర్వాత ఆమె ధ్వజస్తంభం నుంచి గుడిలోనికి తీసుకొనివెళ్ళి నా చేత అంగప్రదక్షిణ చేయించి, నాకు శ్రీవారి ప్రత్యేక దర్శనం చేయించింది.

ఆ తరువాత ఆమె కోసం గుడి మొత్తం వెతికాను, ఎక్కడా కనిపంచలేదు. ఇంత చక్కటి దర్శనభాగ్యం కల్పించిన ఆమెకు ధన్యవాదాలు తెలుపుకోవాలి అనుకున్నాను. కాని నాకు ఆమె మళ్ళీ కనపడలేదు. అక్కడ ఎంతో మందిని అడిగి చూశాను, ఎవ్వరూ నాకు తెలియదంటే నాకు తెలియదనే చెప్పారు.

అప్పుడేమీ తోచక ఆ గుఱ్ఱపుబండి తాత నన్ను ఎక్కడైతే ఆమెకు అప్పగించాడో అక్కడికి వెళ్ళి అక్కడ కూడా చాలా మందిని అడిగి చూశాను, అక్కడ కూడా అదే సమాధానం. కనీసం గుఱ్ఱపుబండి తాత గారి గురించి అడిగితే ఆ గుడిలో అయ్యగార్లు, అక్కడవాళ్ళు ఆశ్చర్యపోయి ఈ తిరుమలలో గుఱ్ఱపుబండ్లు అనేవి లేవు. మేము ఇంతవరకూ ఎప్పుడూ చూడనేలేదు అని తమలో తాము నవ్వుకున్నారు. నేను టాక్సీ కోసం తీసుకువెళ్ళిన డబ్బులు నా చేతిలోనే వుండిపోయినవి. ఇక్కడ విచిత్రం ఏమిటంటే నేను ఆ డబ్బులను చేతిలో పెట్టుకొని కోనేరులో నిండా 3 సార్లు మునిగి లేచి, అంగప్రదక్షిణ చేసిన తరువాత కూడా ఆ డబ్బులు కొద్దిగా కూడా తడవలేదు. అప్పుడు నాకు మొత్తం బోధపడినది. నన్ను గుడిదాకా వృద్ధుని రూపంలో తీసుకొని వచ్చినది మరెవరో కాదు, సాక్షాత్తూ ఆ **"శ్రీ వెంకటేశ్వర స్వామి"** అని, నన్ను స్నానం చేయించి, సూర్య భగవానునికి పూజ చేయించి గుడిలోకి తీసుకొని వెళ్ళినది సాక్షాత్తూ ఆ **"శ్రీ పద్మావతి"** అమ్మవారని అర్థమైంది. ఆ తరువాత అయ్యో! వారిని నేను గుర్తించలేకపోయానే, మూర్ఖురాలను అని, నాలో నేను చాలా బాధపడ్డాను. కాని ఆ అమ్మ నన్ను గుడిలోనికి తీసుకొని వెళ్ళేటప్పుడు "నా స్వామి దర్శనం నీకు తప్పక కలుగుతుంది" అని చెప్పిన మాటలు గుర్తుకు వచ్చి నాలో నేను చాలా సంతోషపడ్డాను. ఇది ఆ స్వామివారి లీలలో భాగమని అనుకొన్నాను. ఆ తరువాత నేను వెంటనే రూముకు వెళ్ళి, మా వారికి, మా బావగారు గణేష్, మా పెద్ద తోడికోడలు శివప్రియ అందరికీ చెప్పాను. వాళ్లు కూడా అక్కడ చాలామందిని అడిగితే, ఇక్కడ గుఱ్ఱపుబండ్లు అనేవి లేవండి అని ఘంటాపథంగా చెప్పారు. అప్పుడు వారంతా వచ్చినది ఆ స్వామివారేనని నమ్మారో లేదో నాకు తెలియదు కానీ నాకు మాత్రం ఇది ముమ్మాటికీ ఆ స్వామివారేనన్న విశ్వాసం కలిగింది.

ఆ తరువాత మేము మళ్ళీ యు.ఎస్.ఏ కు వెళ్ళిపోయాము. కాని నా జీవితంలో 2005 డిసెంబరు తిరుమల యాత్ర మాత్రం మరువలేనటువంటిది.



ఆ తరువాత నాకు మళ్ళీ 2000 సంవత్సరంలో వచ్చిన కల, తిరిగి 2010 మే నెలలో వచ్చింది. అదే కాంతి, అదే గొంతు ఈసారి నాకు స్వామి వారు ఈ వ్రతాన్ని నువ్వు చెయ్యడమే కాక, అందరితో చెప్పాలి, ప్రచారం చేయాలి, అందరితో ఈ వ్రతాన్ని చేయించే విధంగా నా మహిమలను తెలపాలి, నీ ఈ జన్మ **"శ్రీవేంకటేశ్వర వ్రతమాహాత్మ్యం"**ను చాటిచెప్పేందుకే జన్మించావు అని చెప్పారు. అప్పుడు స్వామి వారిని నేను అడిగాను, "నేను ఒక్కదాన్ని, నా మాట *ఎవరు వింటారు, ఎందుకు వింటారు, నన్ను ఎలా నమ్ముతారు"* అప్పుడు స్వామి వారు నవ్వి, *"నీవు ఈ వ్రతాన్ని మొదలుపెట్టు నీకు దారి అదే దొరుకుతుంది"* అని చెప్పారు. ఈ కల గురించి నేను నా భర్త ఋషికేశ్‌తో చెప్పాను. ఆయన కూడా అందుకు అంగీకారం తెలిపారు. అంతేకాక స్వామివారు నన్ను ఈ పుస్తకాన్ని రచించవలసిందిగా ఆదేశించారు.

నేను మొదటి సారి 'జూన్ 2010 శనివారం పౌర్ణమి 26'న "శ్రీవేంకటేశ్వర వ్రతం" చేసాను. ఆ తరువాత 'జూలై 2010, 25న ఆదివారం పౌర్ణమి'న మళ్ళీ ఈ వ్రతం చేయడం జరిగింది. అందరిముందూ స్వామి వారికి మహానైవేద్యం సమర్పించి, అందరం కలిసి బయటకు వెళ్ళాము. అరగంట తరువాత లోపలికి వెళ్ళి చూసేసరికి కళ్యాణ వేంకటేశ్వర స్వామి పటం ముందు ఒక పులిహోర ముద్ద కనిపించింది. ఆ తరువాత 'సెప్టెంబర్ 4న 2010 శనివారం ఏకాదశి'న ఈ వ్రతం మళ్లీ చేసాను. ఆ రోజు కూడ అలానే స్వామి వారి ముందు మహానైవేద్యం పెట్టి బయటకు వెళ్ళాము. మహానైవేద్యం అంతా కలిసి ఒక పెద్ద లడ్డూలా మారి కనిపించింది. నేను వెంటనే మా వారిని, కూతురిని, వచ్చిన ఇరుగుపొరుగు స్నేహితులను పిలిచి చూపించాను. అందరూ ఆశ్చర్యానికి లోనయ్యారు. ఈ రోజు నా జీవితంలో మరచిపోలేని రోజు. ఎంతో చక్కటి అనుభూతి. మాటలతో వర్ణించలేని మధురానుభూతి. ఆ రోజు నుంచి మా ఇంట్లో స్వామి వారి మాహాత్మ్యాలు జరుగుతూనేవున్నాయి.

ఆ కలియుగ దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామి వారిని తలచుకుంటూ ఆ రోజు పడుకున్నాము. మరునాడు నిద్ర లేచి 'సెప్టెంబరు 5'న నా ముఖాన్ని అద్దంలో చూసుకొనేసరికి నా నుదుటిమీదనుండి నా ముక్కు మీద వరకు చందనంతో ఆ వేంకటేశ్వరుని నామాలు చాలా పెద్దగా కనిపించాయి. ఆ రోజు నాకు

అర్థమైంది. స్వామి వారు మా ఇంట్లో కొలువైవున్నారని. ఆ రోజు ప్రొద్దునే స్వామి వారికి పూజ చేసి, మేమంతా బయటకు వెళ్ళిపోయాము. ఆ రోజు సాయంకాలానికి తిరిగి ఇంటికొచ్చి చూసేసరికి హారతి పళ్ళెంలో నెయ్యి, వత్తి వేసి హారతి యిచ్చేందుకు సిద్ధం చేసి వుంది. అది చూసేసరికి మాకు అర్థం కాలేదు. కొద్దిగా భయం కూడా వేసింది. *"ఇంట్లో ఎవరూ లేరు, ఈ పని చేసింది ఎవరు?"* అప్పుడు అర్థమైంది. ఇది ఆ దేవదేవుడైన కలియుగ "శ్రీవేంకటేశ్వరస్వామియే" అని అర్థం చేసుకున్నాము. తర్వాత దేవుడికి హారతి యిచ్చి, వంట గదిలో పని చేస్తుండగా ఏదో కాలిన వాసన వచ్చి పరుగు పరుగున మేమంతా గదిలోకి వెళ్ళి చూచేసరికి అగరువత్తులు వెలిగివున్నాయి. అది చూసి నేను మా అమ్మకు ఫోన్‌లో చెప్పాను. అలా మా అమ్మతో మాట్లాడుతునే ఉన్నాను. ఇంతలో మా పాప వచ్చి దీపంలో నెయ్యి వత్తి మళ్ళీ వచ్చింది మమ్మీ అని చెప్పగానే వెళ్ళి అది చూసి స్వామికి దణ్ణం పెట్టుకొని, ఆ దీపాలను వెలిగించాము. నా కలలో ఆ స్వామి చెప్పిన మాట ప్రకారం, సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణుడే మా ఇంటికి వేంచేసియున్నారని చాలా ఆనందం కలిగింది.

**సెప్టెంబరు 6 :** ఈ రోజు మేమందరం వంటినిండా అక్షింతలతో నిద్రలేచాము. ఆ అక్షింతలన్నింటినీ జాగ్రత్తగా ఒక్కచోటికి చేర్చాము. ఆ తరువాత స్నానం చేసి స్వామికి పూజ చేస్తుండగా, స్వామి వారి పటంలోంచి ఒక కాంతి కనిపించింది. అలా ఆ కాంతిని చూస్తుండగా, ఆ కాంతి నా ముఖము మీద వచ్చేసరికి నేను వెంటనే కళ్ళు మూసాను. ఆ తరువాత నాకు ఏమైందో తెలియదు. నాకు స్పృహ వచ్చేసరికి నన్ను మా వారు గట్టిగా పిలుస్తూ లేపుతున్నారు. నేను కళ్ళు తిరిగి కింద పడిపోయానేమోనని అనుకున్నాను. నేను అద్దంలో చూసుకొనే సరికి నా ముఖం మీద అటూ ఇటూ చందననామాలు, మధ్యలో కుంకుమతో నామము. ఇలా నన్ను నేను చూసుకొనేసరికి భయపడ్డాను. ఆ తరువాత మా వారు నాకు చెప్పారు. *"నీ వంటిమీదకు దేవుడు వచ్చాడని, నీ గొంతు మగవానిగా, చాలా పెద్దగా, గంభీరంగా వున్నది"* అని చెప్పారు. కానీ నాకు మాత్రం ఏమీ తెలియదు.

ఆ తరువాత మేము మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో బయటకు వెళ్ళి, సాయంత్రం ఆరుగంటలకు ఇంటికి వచ్చాము. ఇంటికొచ్చేసరికి దీపాలతో,



హారతితో నెయ్యి, వత్తి పెట్టి పూజకు అన్నీ సిద్ధంగా ఉన్నాయి. అలాగే తీర్థం కూడా పెట్టి వుంది. తీర్థం అనగా చల్లని పాలలో బెల్లం కలిపి ఉన్నది.

**సెప్టెంబరు 7 :** ఈ రోజు స్వామివారి పటంలోంచి పసుపు రావడం మొదలైంది. మేము ఆ రోజు ఉదయాన పూజ చేసిన సమయంలో ఏమీ లేదు. మధ్యాహ్నం 12.30 గం.ల సమయంలో ఆ గదిలో శుభ్రం చేద్దామని వెళ్ళాము. అప్పుడు నా కూతురు "మమ్మీ స్వామివారి మందిరం చూసి స్వామివారి పటంలోంచి పసుపు వస్తోంది" అని చెప్పిన వెంటనే నేను కూడా చూసాను. అదే రోజు సాయంకాలం సమయానికి స్వామివారి ముందు దీపాలలో, హారతితో నెయ్యి, వత్తి పెట్టి పూజకు అన్నీ సిద్ధంగా ఉన్నాయి. మేము ఆ పసుపును చూసి ఆశ్చర్యానికి లోనయ్యాము. ఈ పసుపు మన ఇంట్లో వుండే పసుపేమోనన్న సందేహం కలిగింది. కాని ఇంట్లో అంత పసుపు లేదు. నేను వంటగదిలోకి వెళ్ళి నా పోపు డబ్బాను చూసాను. అందులో పసుపు మీద ॐ 卐 ఈ రెండు గుర్తులూ కనిపించాయి. వెంటనే మా వారికి చెబితే ఆయన ఫోటోలు కూడా తీశారు. స్వామివారి పటంలోనుంచి వచ్చే పసుపు చాలా అమోఘం. మా ఇల్లు మొత్తం పసుపువాసనతో నిండిపోయినది. మా ఇంటికి వచ్చిన స్నేహితులు కూడా ఈ అనుభూతిని ఆస్వాదించారు.

**సెప్టెంబరు 8 :** ఈ రోజు పసుపు ఎక్కువ అయింది. అలాగే చిన్న వెండి గిన్నె నిండ చల్లని పాలతో తేనె కలిపి వున్నది. స్వామివారు ఇలా నా ఇంటికి వచ్చిన దగ్గరనుండి స్వామివారికి మూడుపూటలా ఆహారం పెడుతున్నాము. ఆయనను మా ఇంటి పెద్దగా భావించాము. అందుకే ముందుగా ఆయనకు నివేదించిన తరువాతనే మేము తింటున్నాము.

**సెప్టెంబరు 9 :** ఈ రోజు పసుపు స్వామి ముఖం పైదాకా వచ్చింది. అలాగే పసుపుపైన నరసింహస్వామి రూపంలో అందరికీ దర్శనం యిచ్చారు. మా ఇంటికి వచ్చినవాళ్ళలో కొందరికి నరసింహస్వామిరూపం, మరికొందరికి కృష్ణుని రూపం, ఇంకొంతమందికి వేంకటేశ్వరుని రూపం, ఇంకా కొందరికి 'ఓం' (ॐ) రూపం కనిపించింది. ఇలా ఎవరు ఏ దేవుని ఆరాధిస్తారో వారికి ఆయా రూపాలలో దర్శనమిచ్చారు. ఇదేరోజు యింకో విశేషం కూడా జరిగింది. అదేమిటంటే ఇప్పటివరకూ స్వామివారి పటం నుండి పసుపు రావడం, పాలు

రావడం, నెయ్యి, వత్తి, పూజకు సిద్ధం చేసి వుండడం. ఇవన్నీ స్వామివారి మహత్యాలు. కానీ ఇప్పుడు నేను చెప్పబోయేది చాలా విశేషమైనది. దీనినే చాలామంది మా ఇంటికి వచ్చినవాళ్ళు కనులారా చూసి ఆనందానికి లోనయ్యారు.

ఈ రోజు నేను ఉదయాన్నే లేచేసరికి నా ముఖం మీద పసుపు రాసి కుంకుమతో రూపాయి బిళ్ల సైజు బొట్టు పెట్టి వున్నది. మా వారు ముందుగా లేచారు. నన్ను చూసి భయపడ్డారు. వెంటనే నన్ను లేపారు. నీ ముఖం మీద ఏమిటి అని అడిగారు. అప్పుడు నేను లేచి నా ముఖం అద్దంలో చూసుకొనేసరికి చక్కగా పసుపు రాసి, కుంకుమబొట్టు పెట్టి వున్నది. ఇలా ఈ బొట్టు ఆ రోజు మొత్తం పెరుగుతూనే వుంది. నాకు ఏమీ అర్థం కావడంలేదు. ఎందుకు ఇలా నా ముఖంమీద వచ్చినది? వచ్చినది కాక యిలా నా ముఖంమీద పెరగటమేమిటి? ఇలా నా మదిలో అనేక సందేహాలు మొదలయ్యాయి. ఈ రోజు మొత్తం ఆ కుంకుమ చాలా చక్కగా పెద్దగా అయింది. రాత్రి అయ్యేసరికి నా నుదురుమీద గుండ్రంగా బొట్టు పెరిగింది. నా స్నేహితులు, వారి పిల్లలూ వచ్చారు. వారి పిల్లలు భజనలు చేసారు. ఆ తరువాత నాకు సాక్షాత్తూ శ్రీవేంకటేశ్వరస్వామి, అమ్మ పద్మావతి కనిపించారు. అప్పుడు నాకు అర్థమైంది. ఈ మానవరూపంలో వున్న మనకు స్వామివారిని చూసేంతటి శక్తి మన కళ్ళకి వుండదు. అందువల్లనే నా ముఖం మీద పసుపు, కుంకుమ రావడం, కుంకుమ ఇలా పెద్దగా అవడం జరిగింది అని అనుకున్నాము. మనందరికీ స్వామివారిచుట్టూ వున్న కాంతిని చూడలేము. అటువంటిది ఎటువంటి ఇబ్బందీ లేకుండా స్వామివారి సాక్షాత్కారం కావాలి అంటే అందుకు మన కళ్ళకు శక్తిని ఆ దేవదేవుడు, అమ్మవారు ప్రసాదించాలి.

ఈ రోజు ప్రసాదానికి స్వామివారికి పాలలో పంచదార కలిపి నైవేద్యంగా పెట్టాము. కాసేపటి తరువాత ఆ పాలు తేనెపాలగా మారి పాల కింద తేనె కనిపించింది. స్వామివారిని చూడటానికి వచ్చినవాళ్ళు స్వామివారి లీలలు చూసే భాగ్యం, అదృష్టానికి నోచుకొన్నామని ఎంతో సంబరపడ్డారు.

**సెప్టెంబరు 10 :** ఈ రోజు ఉదయాన్నే స్నానంచేసి పూజగదిలోకి వచ్చేసరికి స్వామివారి పటంవద్ద పసుపు పెరిగి "వినాయకుని" రూపంలో దర్శనం ఇచ్చారు. ఈ రోజు కూడా దీపాలలో, హారతిలో నెయ్యి, వత్తి పెట్టి పూజకు అన్నీ



సిద్ధంగా వున్నాయి. ఎప్పటిలాగే ఈ రోజు కూడా స్వామివారిని చూసిన వారందరికీ వినాయకుని రూపంలో దర్శనం ఇచ్చారు. అందరూ వినాయకచవితికి ముందే వినాయకులవారు మీ ఇంటికి వచ్చారు అని అన్నారు. స్వామివారి లీలలు అద్భుతం, అమోఘం. వీటిని చూడటానికి వేయి కళ్ళూ చాలవు.

**సెప్టెంబరు 11 :** ఈ రోజు దీపాలలో, హారతిలో నెయ్యి, వత్తి పెట్టి పూజకు సిద్ధంగా ఉన్నాయి. ఉదయాన్నే లేచేసరికి మళ్ళీ నా ముఖంమీద పసుపు, కుంకుమ ఉన్నాయి. ఇది చూసి మేము చాలా సంతోషపడ్డాము. ఎందుకంటే ఇంతకుముందెన్నడూ ఇలా వచ్చినపుడు "స్వామి, అమ్మవారు" సాక్షాత్కరించారు. స్వామివారి దర్శనభాగ్యం కలుగుతుంది అని సంతోషపడ్డాము. స్వామివారికి పులిహోర, దద్దోజనం నైవేద్యంగా పెట్టాము. కాసేపటి తరువాత లోపలికి అందరం కలిసి వెళ్లిచూడగా ప్రసాదం కలిసిపోయి వుంది. ఆ తరువాత అందరం ఆ ప్రసాదాన్ని స్వీకరించాము.

ఇదేరోజు కొంతమంది వచ్చారు. అందులో ఒకరు స్వామివారిమీద నమ్మకం లేకుండ వచ్చారు. ఆమె నన్ను గంటకుపైగా అనేక ప్రశ్నలు వేసింది. నేను అన్నింటికీ సమాధానం చెప్పాను. ఆమె "దేవుడు ఒక రాతి విగ్రహం, ఆయనను మనము కోర్కెలు మాత్రమే అడగాలి. ఇలా దేవుడు ఇంటిలోకి రావడం, ఇవన్నీ మీ భ్రమ మాత్రమే" అనేది ఆమె వాదన. ఆమె అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పిన తర్వాత ఆమె తీసుకొనివచ్చిన పువ్వులను స్వామివారికి పెట్టాను. స్వామివారితోపాటు అందరి దేవుళ్ళముందూ పెట్టాను. ఆ తరువాత నేను ఇచ్చిన స్వామివారి ప్రసాదం తీసుకొనివెళ్ళారు. ఇలా వాళ్ళు వెళ్ళిన తర్వాత మాకు తెలిసిన వేరేవాళ్ళు వచ్చారు. ఆమె కూడా స్వామివారిని పరీక్షించేందుకు వచ్చిందని గ్రహించాను. స్వామివారి ప్రసాదం తీసుకోకుండా వెళ్ళిపోయారు. ఆ తర్వాత మా వారు, మా అమ్మాయి, స్నేహితుల ఇంటికి సాయంకాలం భోజనానికి వెళ్ళారు. నేను మాత్రం ఇంట్లోనే వున్నాను. నా ముఖంమీద వున్న కుంకుమ పెరుగుతున్నది. కాని నాకు యింకా స్వామివారి దర్శనం కలుగలేదని ఆయనకోసం ఎదురుచూస్తూ ఇంట్లోనే వుండిపోయాను.

అంతలో నాకు ఒక ఫోన్‌కాల్ వచ్చింది. ఆ ఫోన్ చేసింది నమ్మకుండా వెళ్ళిన స్నేహితురాలు. ఆమె "మీ ఇంటికి "బాలాజి, పద్మ" అనేవాళ్ళు రావాలి అని

అనుకుంటున్నారు. వాళ్ళకి మీ ఇంటి అడ్రస్, ఫోన్ నెంబర్ ఇచ్చాను. వాళ్లకు ఇబ్బంది కలిగితే నీకు ఫోన్ చేస్తారు అని ఆమె చెప్పింది. అందుకు నేను సరేనని చెప్పాను. అప్పటికి నా మనసు అస్సలు బాగోలేదు. స్వామివారి దర్శనం ఎప్పుడు కలుగుతుందా? అని ఎదురుచూస్తున్నాను. అప్పుడు మా ఇంటికి "బాలాజి, పద్మ" అనేవాళ్ళు వచ్చారు. వారిని ఇంట్లోకి ఆహ్వానించాను. వారిని పూజగదిలోకి తీసుకొనివెళ్ళాను. వాళ్ళు స్వామిని చూసి "నువ్వు చాలా అదృష్టవంతురాలివి. స్వామివారి అనుగ్రహం నీకు సంపూర్ణంగా వుంది" అని అన్నారు. వారికి కూడా ప్రసాదం ఇచ్చాను. వారు సంతోషంగా స్వీకరించి మళ్ళీ తర్వాత వస్తామని చెప్పి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిన తర్వాత నాకు కలియుగ దేవుడైన "శ్రీవేంకటేశ్వరస్వామి, పద్మావతి" దర్శనం లభించింది.

కాసేపటి తర్వాత మా వారు ఇంటికి వచ్చారు. మా వారికి జరిగిన విషయమంతా వివరించాను. ఇలా మన ఇంటికి "బాలాజి, పద్మ" అనేవాళ్ళను ఉదయాన వచ్చిన మా స్నేహితురాలు పంపించింది అని చెప్పాను. అప్పుడు మా వారు "ఆమెకే నమ్మకం లేనప్పుడు వేరేవాళ్ళను ఎందుకు పంపిస్తుంది" అని అడిగారు. అప్పటిదాకా నాకు ఆ సందేహం కలగలేదు. ఆ తర్వాత నాకు ఒక ప్రశ్న మదిలో మెలగసాగింది. వాళ్ళు రానంతవరకూ స్వామివారి దర్శనం కలుగలేదు, వారు వచ్చి వెళ్ళిన తర్వాతనే నాకు వారి దర్శనం కలిగింది. వాళ్ళు రాకముందు స్వామివారి దర్శనం ఎందుకు కాలేదు? అని ప్రశ్నించుకున్నాను. ఎవరైతే మా ఇంటికి "బాలాజి, పద్మ" అనేవాళ్ళను పంపించారో, వారికి మేము ఫోన్ చేసి మాట్లాడితే, ఆమెకు అస్సలు ఆ పేర్లు కలిగినవాళ్ళు నా స్నేహితులలోగానీ, బంధువులలోగానీ ఎవరూ లేరు అని గట్టిగా చెప్పింది.

అప్పుడు మళ్ళీ నాకు అర్థమైంది. మా ఇంటికి వచ్చిన వారు మరెవరో కాదు. నేను ఎదురుచూస్తున్న స్వామివారేనని. మొదటిసారి అలా మిమ్మల్ని తెలుసుకోలేకపోయాము ఇప్పుడు రెండవసారి కూడా ఇలా తెలుసుకోలేకపోయాను అని బాధపడ్డాను. నా ఇంటికి వచ్చినా కూడా నేను గుర్తుపట్టలేకపోయాను అని విలపించాను. స్వామీ! ఇదేమి పరీక్ష తండ్రీ! అని స్వామిని అడిగాను.

అదే రోజు రాత్రి 11 గంటలకు దేవుడి గది మూసాము. బయటకు వచ్చి నేను, మా వారు టి.వి. చూస్తున్నాము. పడుకొనేముందు స్వామివారిని దర్శనం



చేసుకొని పడుకుందామని ఆ గదిలోకి వెళ్ళాము. అప్పటికి సమయం రాత్రి 11.30. "శ్రీనివాసుని, పద్మావతి" అమ్మ విగ్రహం నుండి తేనె రావడం కనిపించింది. అది చూసి నేను, మా వారు నమ్మలేకపోయాము. మా వారు యిది కలా, నిజమా! అని ఆశ్చర్యపడ్డారు. వెంటనే వీడియో, ఫోటోలు తీసి మా పెద్ద బావగారు (గణేష్), మా పెద్ద తోడికోడలు (శివప్రియ)కు ఫోన్ చేసి ఆన్‌లైన్‌కు రమ్మని చెప్పాము. వారు వెంటనే వచ్చి, తేనె రావడం చూసి ఆశ్చర్యానికి లోనయ్యారు. వారు చాలా సంతోషపడ్డారు. ఆ సంతోషంలో నేను స్వామివారి దగ్గర మధ్యాహ్నం సమయంలో నమ్మకంలేనివాళ్ళు ఇచ్చిన పువ్వుల గురించి పూర్తిగా మరచిపోయాము. కాసేపటి తర్వాత గుర్తుకు వచ్చి చూస్తే పువ్వులన్నీ తోసేసినట్లుగా కనిపించింది. అపుడు మాకు అర్థమైంది. "స్వామివారి దగ్గర "వారిని నమ్మి, భక్తితో, శ్రద్ధతో తీసుకొని వచ్చినవాళ్ళ పువ్వులు మాత్రమే పెట్టాలి" అని నిర్ణయించుకున్నాము.

ఇలా ప్రతిరోజూ ఒక మరపురాని రోజుగా చాలా ఆనందంగా, ఎన్నో మధురానుభూతులతో సాగుతోంది.

**సెప్టెంబరు 12 :** ఈ రోజు పసుపుమీద కుంకుమ రావడం మొదలైంది. తేనె కూడ చుక్కలు, చుక్కలుగా స్వామివారి వద్దనుండి వస్తున్నది. మధ్యాహ్నం నైవేద్యం పెట్టాము. కాని స్వామివారు తిన్నట్టు మాకు కనిపించలేదు. సాయంకాలం స్వామివారికి అన్నం, దొండకాయ వేపుడు నైవేద్యంగా పెట్టాము. అన్నం అంతా లడ్డుగా మారి కనిపించింది. దానిని ఇంటికి వచ్చిన వాళ్ళందరికీ నైవేద్యంగా పెట్టాము.

**సెప్టెంబరు 13 :** ఉదయాన స్వామివారికి ద్రాక్షపండ్లు నైవేద్యంగా సమర్పించాము. స్వామి ఆ ద్రాక్షపండ్లు సగం తిని, సగం మాకు నైవేద్యంగా వదలిపెట్టారు. అలాగే ఈ రోజుకూడా దీపాలలో, హారతితో నెయ్యి, వత్తి, వచ్చి పూజకు సిద్ధంగా ఉన్నాయి. స్వామివారు తిన్న ద్రాక్షపండ్లను మేము నైవేద్యంగా తిన్నాము. కొన్ని ప్రక్కకు పెట్టాము. సాయంకాలం ఎవరైనా వస్తే వారికి కూడా యివ్వవచ్చు అని ఉంచాము. మా పాపను స్కూల్‌కి పంపించి, ఇంటికి వచ్చి వంటగదిలో వంట చేస్తూ ఫోన్‌లో మా వారితో మాట్లాడుతున్నాను. ఉన్నట్టుండి పూజగదిలోనుండి మువ్వల చప్పుడు వినిపిస్తోంది. మా వారిని వినమని చెపితే

ఆయనకు వినిపించడం లేదని చెప్పారు. అప్పుడు వెంటనే వీడియో తీశాను. ఇలా వీడియో తీస్తుండగా నా కాలు గోడకు తగిలి పెద్ద శబ్దం రావడంతో ఆ మువ్వల చప్పుడు ఆగిపోయింది. వెంటనే నేను మా బావగారి (గణేశ్)కి ఇంటర్నెట్ ద్వారా చూపించాను. ఆయనకూడా విన్నారు. అప్పుడు "నేను విన్నది భ్రమకాదు, నిజమే" అని అర్థమైంది. దాంతో నాకు చాలా సంతోషం కలిగింది. అమ్మవారి ఆనంద నృత్యం వినగలిగే అదృష్టం నాకు కలిగినందుకు చాలా సంతోషమైనది.

మా పాపను స్కూల్‌నుండి తీసుకొనివచ్చిన తర్వాత కూడా నాకూ, మా పాపకూ మువ్వల చప్పుడు చక్కగా ఐదు నిముషాలపాటు వినిపించింది. అమ్మవారు కాళ్ళకు మువ్వలు కట్టుకొని నడుస్తున్నట్టుగా అనిపించింది. మా వారికి కూడ రాత్రి అమ్మవారి మువ్వల చప్పుడు వినిపించింది.

**సెప్టెంబరు 14 :** తేనె యింకా స్వామివారి విగ్రహం నుండి వస్తున్నది. స్వామివారి దర్శనానికి వచ్చినవారందరికీ తేనె యిస్తున్నాము.

**సెప్టెంబరు 15 :** ఈ రోజు స్వామివారి పటంవద్ద కుంకుమ పెరిగింది. అలాగే మేము తేనెకు చిన్న గిన్నె పెట్టాము. ఆ చిన్న గిన్నె నిండినది. ఈ రోజు క్రొత్త గిన్నె పెట్టాము.

**సెప్టెంబరు 16 :** ఈ రోజు స్వామివారికి ఆపిల్‌పండు నైవేద్యంగా పెట్టాము. స్వామివారు ఆపిల్‌ను తిన్నట్టుగా చాలా మంచిగా కనిపించింది.

**సెప్టెంబరు 18 :** ఈ రోజు స్వామివారి పటంమీద వున్న పసుపు, కుంకుమ క్రిందకు జారి వున్నది. స్వామివారి కిరీటం, ముఖం చాలా చక్కగా కనిపిస్తున్నది. ఈ రోజునుండి మా ఇంటికి వచ్చినవారందరికీ స్వామివారి నుండి వచ్చిన పసుపు, కుంకుమ ఇస్తున్నాము. ఈ రోజు కూడా తేనె, పాలు వచ్చి వున్నాయి. పదినిముషాల పాటు చాలా వేగంగా తేనె స్వామి, అమ్మవార్ల విగ్రహం నుండి వచ్చింది. మధ్యాహ్నం స్వామివారికి నైవేద్యంగా కిచిడీ పెట్టాము. నైవేద్యంగా పెట్టిన తర్వాత మేము బయట కూర్చొని టి.వి. చూస్తున్నాము. అప్పటికి స్వామివారి వద్ద నైవేద్యం పెట్టి 15 నిముషాలు అయింది. మేము యింకా టి.వి. చూస్తున్నాము. ఇలా టి.వి. చూస్తూండగా స్వామివారి వద్ద ఉంచిన



నైవేద్యము నా నోటిలోకి వచ్చింది. స్వామివారు ఒక ముద్ద తిని, నాకు ఒక ముద్ద పెట్టినట్లుగా ఫోటో చూస్తే కనిపిస్తుంది.

**సెప్టెంబరు 19 :** ఈ రోజు స్వామివారికి ఆపిల్‌పండు నైవేద్యంగా పెట్టాము. స్వామివారు ఒక ఆపిల్ ముక్క తిని, ఒక ముక్కను నాకు పెట్టారు. నేను వంటగదిలో వంట చేస్తున్న నాకు నోటిలోకి ఆపిల్ ముక్క వచ్చింది. వెంటనే నేను మా వారికి చూపించాను. తర్వాత పూజగదిలోకి వెళ్ళి చూసేసరికి స్వామివద్ద ఆపిల్‌ను రెండుసార్లు కొరికి తిన్నట్టుగా తెలుస్తోంది.

అలాగే సాయంకాలం స్వామివారికి సబ్జగిత్తు షరబత్ నైవేద్యంగా చిన్న గిన్నెనిండా పెట్టాము. కాసేపటి తర్వాత వెళ్ళి చూసేసరికి ఆ గిన్నెలో షరబత్ స్వామివారు తాగి కొద్దిగా మాకు మిగిల్చారు. మేముదానిని నైవేద్యంగా స్వీకరించాము. తేనె స్వామివారి వద్దనుండి ఇంకా వస్తూనే వున్నది.

**సెప్టెంబరు 20 :** ఈ రోజు స్వామివారికి అన్నం, దొండకాయ వేపుడు నైవేద్యంగా పెట్టాము. ఈ నైవేద్యాన్ని స్వామివారు 4 (నాలుగు) లడ్డూలుగా చేసి వుంచారు. అలాగే సాయంకాలం చపాతీ, శనగల కూర నైవేద్యంగా పెట్టాము. ఇది కూడా స్వామివారు చపాతి, శనగలకూర తిన్నట్టు కనిపిస్తుంది. తేనె, స్వామివారి విగ్రహం నుండి ఇంకా వస్తూనే వున్నది.

**సెప్టెంబరు 21 :** ఈ రోజు అన్నం, పాలకూరపప్పు నైవేద్యంగా పెట్టాము. కాసేపటి తర్వాత వెళ్ళి చూస్తే అన్నం, పాలకూర పప్పు కలిసిపోయి స్వామి మధ్యలో ఒక ముద్ద తిన్నట్టు మాకు కనిపించింది. సాయంకాలానికి స్వామివారి ముందు దీపాలలో, హారతిలో నెయ్యి, వత్తి వచ్చి పూజకు సిద్ధంగా ఉన్నాయి. అలాగే తేనె, పాలు కూడా సిద్ధంగా వున్నాయి.

ఈవిధంగా స్వామివారు వారి లీలను చూపించి వారి మహిమలని చాటిచెప్పడానికి ఆ కలియుగ నాథుడు తన లీలలను ఈవిధంగా చూపించడం మాకు మహదానందంగా వుంది.

**సెప్టెంబరు 22 :** ఈ రోజు స్వామివారికి అన్నం, బీన్స్ ఫ్రై చేశాను. కాసేపటి తర్వాత ఆ గదిలోకి వెళ్ళి చూసేసరికి అన్నం, బీన్స్ ఫ్రై కలిపి స్వామివారు తిన్నట్టుగా మాకు కనిపించింది. సాయంకాలం స్వామివారికి ద్రాక్షలు నైవేద్యంగా

పెట్టాము. ఆ తర్వాత మేమంతా రాత్రి భోజనం చేస్తుండగా నా నోటిలోకి స్వామి ముందు పెట్టిన ద్రాక్ష వచ్చింది. ఆ తర్వాత మేము గదిలోకి వెళ్ళి చూసేసరికి గిన్నెలో రెండు ద్రాక్షలు మిగిలివున్నాయి.

**సెప్టెంబరు 23 :** ఈ రోజు స్వామివారికి చిన్న ద్రాక్షలు నైవేద్యంగా పెట్టాము. ఈ రోజు కూడా స్వామివారి దగ్గర పెట్టిన నైవేద్యం నా నోటిలోకి వచ్చింది. నా నోటినిండా ద్రాక్షలు వచ్చాయి. యింకా "స్వామి, అమ్మ" విగ్రహం నుండి తేనె వస్తోంది. ఈ రోజు మా ఇంటికి మా వారి స్నేహితులు వచ్చారు. వారు వచ్చేముందు తేనె చాలా ఎక్కువ (ధారలా) వస్తోంది. మా వారు చూస్తుండగా ఆయన కంటిముందు కొండెక్కిన దీపం మళ్ళీ వెలిగింది. మా వారు వెంటనే నన్ను పిలిచి చూపించారు. ఆ రోజు ఇంటికి వచ్చిన స్నేహితులు అది చూసి చాలా సంతోషించారు. వారు "ఎంత అదృష్టం చేసుకుంటే ఈవిధంగా మేము చూడగలుగుతాము" అని చాలా ఆనందంతో ఉప్పొంగిపోయారు.

**సెప్టెంబరు 24 :** ఈ రోజు ప్రొద్దున, మధ్యాహ్నం స్వామివారికి నైవేద్యం పెట్టాను. కాని స్వామివారు నైవేద్యాన్ని తినలేదు. సాయంకాలం స్వామివారికి ఎండు ద్రాక్ష (కిస్మిస్) పెట్టి, మేము బయటకు వెళ్ళిపోయాము. మా ఇంటినుండి 5 కిలోమీటర్ల దూరం వెళ్ళాము. అక్కడ స్వామిముందు పెట్టిన కిస్మిస్ నా నోట్లోకి వచ్చాయి. అప్పటివరకూ ఇంట్లో ఉన్నప్పుడే ఇలా జరిగేది. మొదటిసారి ఇంటినుండి అంత దూరం వెళ్ళిన తర్వాత కూడా నా నోట్లోకి ఇలా ప్రసాదం రావడం చూసి నా ఆనందానికి అంతులేదు. ఎందుకు ఇలా స్వామి ముందు పెట్టిన నైవేద్యం నా నోట్లోకి ఎందుకు వస్తున్నదో అర్థం కాలేదు.

**సెప్టెంబరు 25 :** ఈ రోజు ఉదయాన్నే పూజగదిలోకి వెళ్ళేసరికి దీపాలలో, హారతిలో నెయ్యి, వత్తి, తేనె, పాలు, పూజకు సిద్ధంగా ఉన్నాయి. పూజకు నేను, మా వారు, మా పాప ముగ్గురం కూర్చొని పూజచేశాము. నేను సెప్టెంబర్ 4న గంధాన్ని నీళ్లలో కలిపాను. అది ఈ రోజుకీ గంధం చాలా నీళ్ళగా ఉన్నది. మా పూజ అయిపోయేసరికి నా ముఖంమీద గంధంతో బొట్టుపెట్టి ఉన్నది. నా మెడమీద నామాలు పెట్టివున్నాయి. పూజ అయిపోయిన తర్వాత మేము బయటకు వచ్చి మావారు, మా పాప ఆడుకుంటున్నారు. నేను వంటగదిలో వంట చేస్తున్నాను. అంతలో 3 అగరుబత్తులు వెలిగాయి. వెంటనే వెళ్ళి





అగరుబత్తులను ఒక గ్లాసులో పెట్టాను. మళ్ళీ బయటకు వెళ్ళాము. కాసేపటికి మళ్ళీ ఒక కట్ట అగరుబత్తులు వెలుగుతున్నాయి. మా ఇల్లు మొత్తం అగరుబత్తి వాసనతో నిండిపోయి వున్నది. ఈ రోజు మధ్యాహ్నం స్వామివారికి కూరగాయలతో చేసిన అన్నం పెట్టాను. స్వామివారు నైవేద్యాన్ని తిన్నట్టుగా మనకు కనిపిస్తుంది.

ఈ రోజు సాయంకాలం స్వామివారివద్ద మళ్ళీ దీపాలలో, హారతిలో నెయ్యివచ్చి పూజకు సిద్ధం అయివున్నది. అప్పుడు స్వామివారికి నల్లని ద్రాక్షపండ్లు నైవేద్యంగా పెట్టాము. కాని స్వామివారు తినలేదు.

ఈ రోజుకీ "స్వామి, అమ్మవారి" విగ్రహం నుండి తేనె వస్తున్నది. గంధం కూడ నీళ్ళతో చక్కగా కలిసివున్నది.

**సెప్టెంబరు 26 :** ఈ రోజు స్వామివారికి ప్రొద్దున, మధ్యాహ్నం నైవేద్యం పెట్టాము. కాని స్వామివారు తినలేదు. సాయంకాలం పండ్లు నైవేద్యంగా పెట్టి షాపింగ్ కొరకు బయటకు వెళ్ళిపోయాము. మా ఇంటినుండి ఆ షాపింగ్ ప్లేస్ 4 కిలోమీటర్లు. అక్కడికి వెళ్ళాక నా నోట్లోకి పండ్లు వచ్చాయి. ఇంటికి వచ్చిచూసేసరికి పెట్టిన పండ్లు తగ్గిపోయి వున్నవి.

**సెప్టెంబరు 27 :** ఈ రోజు స్వామివారికి ఆపిల్‌పండ్లు నైవేద్యంగా పెట్టాము. స్వామివారు ఒక ముక్క ఆయన తిని, ఒక ముక్క నా నోట్లో పెట్టారు. ఆ తరువాత సాయంకాలం అరటిపండు నైవేద్యంగా పెట్టాము. అక్కడ పెట్టిన అరటిపండు మూడోవంతు నా గొంతులోంచి వచ్చినది. యిలా నా గొంతులో నుండి అరటిపండు వస్తున్నప్పుడు మా వారు, మా పాప చూస్తూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. అరటిపండు ఎక్కడా నలగకుండా, చాలా చక్కగా వచ్చింది. ఆ అరటిపండు వచ్చేటప్పుడు నా గొంతు చాలా నొప్పిగా అనిపించింది. తర్వాత లోపలికి వెళ్ళి చూశాము. ఆ అరటిపండు పావు వంతు మాత్రమే ఉన్నది. ఆ అరటిపండు క్రింద తేనెచుక్క కూడా మాకు కనిపించింది.

ఈవిధముగా తేనె ప్రతిరోజూ "స్వామి" వారి వద్దనుంచి వస్తూనే వుంది. మేము గత మూడు వారాలుగా గమనించినది. ప్రతి శనివారం ఒక విశేషం జరుగుతున్నట్టుగా గుర్తించాం. శనివారం స్వామివారి వద్దనుంచి కొన్ని, కొన్ని సమయాలలో తేనె చాలా వేగంగా రావడాన్ని చాలామంది చూశారు. యిలా





ఈవిధముగా గడుస్తున్న సమయంలో ఒకరోజు మరియొక అద్భుతం జరిగింది. ఈ రోజుకి అత్యంత పర్వదినంగా గుర్తించవచ్చు.

**అక్టోబర్ 10 :** ఈ రోజు ప్రొద్దున స్వామివారికి యాపిల్‌పండు నైవేద్యంగా పెట్టాము. నేను బయట వంటగదిలో వంట చేస్తున్నాను. మా అందరికీ స్వామివారి గదిలోనుండి సువాసన రావడం మొదలైంది. మేము లోపలికి వెళ్ళిచూడగా మేము చూస్తున్నది  నిజమా! కలయా! అనే భ్రమలో పూర్తిగా మునిగిపోయాం. అక్కడ నేను నైవేద్యం ఆపిల్ పండు పెట్టినది అలానే వున్నది. కాని ఆ ఆపిల్ పండుతోపాటు "స్వామి" వారి తిరుపతి లడ్డూ కనిపించింది. మేము స్వామివారి లడ్డూలను చాలా తిన్నాము. కాని వేడి లడ్డు మేము ఎప్పుడూ తినలేదు. దానిని ముట్టుకొని చూస్తే వేడిగా వున్నది. మా చేతికి నెయ్యి అంటినది. లడ్డుయొక్క రుచి వర్ణించలేనిది.

ఈ "వేంకటేశ్వరస్వామి లీల" రచన ఒక యజ్ఞంలా జరిగింది. అతి సామాన్యురాలినైన నాకు ఈ భాగ్యాన్ని సాక్షాత్ శ్రీమన్నారాయణుడైన కలియుగదేవుడు "శ్రీవేంకటేశ్వరస్వామి, పద్మావతి అమ్మ" ఆశీర్వాదబలం తప్ప మరొకటి కాదు.

ఈ "లీల" రచన సమయంలో నన్ను అన్నివిధాలా ప్రోత్సహించి, నిరంతరం నా వెన్నంటే వుండి వెన్నుతట్టిన నా భర్త ఋషికేశ్, నా కూతురు నేహ, మరియు నా తల్లిదండ్రులు, మా పెద్దబావగారు, మా పెద్ద తోడికోడలు, నేను వ్రాయగలనా అని భ్రమపడుతున్న సమయంలో నువ్వు వ్రాయగలవు అనే నమ్మకాన్ని నాలో పెంచిన పబ్బా భాస్కర్ గార్లకు, వీరందరికీ ఇవే నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. ఈ అమృతకావ్యాన్ని అత్యంత చక్కగా ప్రింటింగ్ చేసిన శ్రీరామా బుక్‌షాప్ యజమానులు పబ్బా భాస్కర్‌గారికి ప్రత్యేక ధన్యవాదాలు. ఈ వ్రతాన్ని రచించిన "తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి"గారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తక రచనకు సహాయపడిన ప్రతి ఒక్కరు, విన్నవారు, అందరూ స్వామివారి కృపకు పాత్రులై, స్వామివారి అనుగ్రహం ఎల్లప్పుడూ కలగాలని ప్రార్థిస్తున్నాను. వ్రతాన్ని చేసిన వారందరికీ స్వామి దివ్యానుగ్రహం తప్పక ప్రాప్తించాలని కోరుకుంటున్నాను.

**- లలిత ఋషికేశ్**





# శ్రీవారి ఉవాచ

కలియుగ దైవమైన ఆ వైకుంఠనాథుడు సాక్షాత్తు ఆ "శ్రీవేంకటేశ్వరస్వామి" వారు వేదాల నుండి కొన్ని మంత్రములను నాకు చెప్పినారు. ఈ మంత్రములు ప్రతిరోజూ పూజా సమయంలో చదివినయెడల భక్తిభావము అంకురిస్తుంది. అలాగే శ్రీవారిపై వారి వారి భక్తి పరిపక్వత ప్రకారంవల్లను, వారు కీర్తించే భగవన్నామాల్లోని భక్తి విశేషణాలవల్ల ఆయన భక్తులకు గోచరమవుతున్నాడు.

ఈ క్రింది విధంగా చదవవలెను.

**మురారిసేవక జరాదిపీడిత నిరార్తిజీవన నిరాశ**

**భూసుర వరాతిసుందర సురాంగనారతి**

**కరాంగసౌష్ఠవ కుమారతాకృతి కుమారతారక**

**సమాపనోదయ తనూనపాతక మహాపదామయ**

**విహాపనోదిత సకలభువన విదిత కుమారధారాభిధాన తీర్థాదిష్ఠితస్య**

**ధరణితల గత సకల హతకలిల శుభసలిల**

**గతబహుళ వివిధమల హతిచతుర రుచిరతర**

**విలోకనమాత్ర విదళిత వివిధమహాపాతక**

**స్వామిపుష్కరిణీ సమేతస్య**

ఈ విధముగా నిత్యము పఠించినవారికి "సకల ఆయురారోగ్యైశ్వర్య భోగభాగ్యములు" కలుగగలవు.

**- లలిత ఋషికేష్**

# వ్రత విధానము

**- తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి**

కలియుగంలో శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహం పొందడానికి ఈ వ్రతాన్ని ఆచరించడం అతి తేలికైన మార్గం. ఈ వ్రతమాచరించిన వెంటనే ఎటువంటి కష్టాలైనా తీరతాయి. సాక్షాత్తూ వైకుంఠవాసుడైన ఆ శ్రీమన్నారాయణునిచే అనుగ్రహింపబడిన ఈ వ్రతం ఆచరించడం అతి సులభం. ఈ వ్రతాన్ని ఎవరైనా, ఎప్పుడైనా ఆచరించవచ్చును. ఆర్థికబాధలుగాని, ఆరోగ్యబాధలుగాని, సాంసారిక బాధలుగానీ, మరే ఇతర కారణాలవల్లనైనా మనశ్శాంతి లేనప్పుడు ఈ వ్రతం ఆచరించినచో అన్ని కష్టాలు గట్టెక్కుతాయి. అలాగే మీ ఇంట్లో ఏ శుభకార్యం తలపెట్టినప్పుడైనా కూడా ఈ వ్రతం చేసుకొనవచ్చును. ఉద్యోగ, వ్యాపారాభివృద్ధి నిమిత్తం కూడా ఈ వ్రతమాచరించి ఎంతో అద్భుత ఫలితాలను వెనువెంటనే పొందగలరు.

ఈ వ్రతాన్ని పైన చెప్పినవిధంగా ఎప్పుడైనా వారి వారి శక్త్యనుసారం ఆచరించవచ్చును. ప్రత్యేకించి మార్గశిర, మాఘ, కార్తీక మాసాలలోగాని, పౌర్ణమి, పంచమి, సప్తమి, ఏకాదశి తిథులయందుగాని, శ్రవణ, స్వాతి నక్షత్ర దినములయందుగాని ఆచరించిన మిక్కిలి ఫలప్రదము.

ఉదయముగానీ, సాయంత్రముగానీ ఈ వ్రతము ఆచరించవచ్చును. ఈ వ్రతము ఐదు అధ్యాయాలతో కూడుకొన్నది. మొదటిది సాక్షాత్తూ శ్రీవేంకటేశ్వరస్వామివారే అనుగ్రహించగా మిగిలిన నాలుగు అధ్యాయాలకు మహాతపః సంపన్నులైన విశ్వామిత్ర, వశిష్ట భరద్వాజ, అత్రి మహామునులు ప్రవర్తకులై ఉన్నారు. మీ స్వగృహమందుగాని, వసతి గృహమందుగాని, శ్రీస్వామివారి ఆలయమందుగాని, ఇతర ఏ పుణ్యక్షేత్రములయందుగానీ, నదీతీరములయందుగాని ఈ వ్రతమును ఆచరించవచ్చును. వీలైనంతవరకూ బంధుమిత్రులందరినీ ఆహ్వానించి ఆచరించవలెను.

ముందుగా ఈ వ్రతాన్ని ఆచరించేవారు ఒక ప్రదేశాన్ని ఎన్నుకొని, ఆ ప్రదేశాన్ని శుభ్రం చేసుకోవాలి. తరువాత మంటపమును ఏర్పాటు చేసుకొని అందు శ్రీవేంకటేశ్వరస్వామివారి పటమును ఉంచుకొనవలెను. శ్రీదేవి, భూదేవిల ఉత్సవ విగ్రహాలతో కూడిన కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి పటమును కూడా ఉంచుకొనిన మిక్కిలి శ్రేష్ఠము.

ఈ వ్రతాన్ని ఎవరైతే మిక్కిలి భక్తిశ్రద్ధలతో ఆచరిస్తారో, ఆ ప్రదేశానికి తానే స్వయంగా ఏదోకరూపంలో విచ్చేసి ప్రసాదాన్ని స్వీకరిస్తానని శ్రీవారే స్వయంగా సెలవిచ్చారు.





సాక్షాత్తూ శ్రీమన్నారాయణులవారే సెలవిచ్చిన మరో విశేషం ఒకటుంది. అదేమనగా ఒకవేళ మనలో ఎవరికైనా ఎటువంటి కష్టమైనా కలిగి, ఇంత వివరంగా ఈ వ్రతము ఆచరించడానికి తగిన సమయముగాని, వేరే కారణాలచేతగాని వీలుపడనియెడల ఒంటరిగా కూర్చొనికూడా ఈ వ్రతము ఆచరించవచ్చును.

శ్రీస్వామివారి పటము ముందు కూర్చొని, ముందుగా విఘ్ననాయకుడైన విఘ్నేశ్వరుని మనస్సులో ప్రార్థించి, తరువాత అష్టదిక్పాలకులు, నవగ్రహ దేవతలకును, మనస్సులోనే నమస్కరించవలెను. తులసీదళములు, కొబ్బరికాయ, అందుబాటులో ఉన్న ఫలపుష్పాదులను పళ్లెములో ఉంచుకొనవలెను. శ్రీస్వామివారికి నమస్కరించి వ్రత కథలన్నీ మనసులోనే చదువుకుని చివరగా కొబ్బరికాయను, ఫలములను శ్రీస్వామివారికి నివేదించవలెను. అవి ప్రసాదముగా స్వీకరించినచో మీ కష్టములు వెంటనే తొలగిపోగలవు.

ప్రతి కథ సమాప్తమైనప్పుడు ఒక కొబ్బరికాయను నివేదించవలెను. మహాప్రసాదమును గోధుమరవ్వ, చక్కెరను కలిపి చేయవలెను. అందు అరటిపండ్లు తప్పక వేయవలెను. ప్రతి కథ అయిన తర్వాత **గోవిందా.... గోవిందా... గోవిందా...** అని మూడుసార్లు ప్రార్థించవలెను.

స్వామివారికి తులసీదళము మిక్కిలి ప్రియము. కావున పూజలో తులసీ దళములను నివేదించిన అత్యంత ఫలము కలుగును. వ్రతము పూర్తయిన పిమ్మట ఆ తులసీ దళములను అందరూ ప్రసాదముగా స్వీకరించినచో అన్ని రోగములూ నశించి, అష్టైశ్వర్యములు కలుగును. వ్రత సమాప్తికాగానే కొబ్బరికాయను కొట్టి కొబ్బరి ముక్కలు మహాప్రసాదముతో కలిపి శ్రీవారికి నివేదించి, స్వీకరించి, వచ్చినవారందరికి ఇచ్చినయెడల ఎంతో పుణ్యము లభించును.

కనుక ఈ వ్రతమును వీలున్నచో తప్పక యథావిధిగా కలశస్థాపనతో వివరంగా జరుపుకొనవలెను. వీలుకాని ప్రత్యేక పరిస్థితులలో మాత్రము పైన చెప్పిన రెండవవిధముగా కూడా ఆచరించవచ్చును.

మన కష్టములు విశ్వమంతటిలో ఆ స్వామివారికి తెలిసినట్లుగా మరెవరికీ తెలియవు. కావున ఆ దయామయుని ప్రార్థించి, సంకల్పించి, వ్రతము ఆచరిస్తే తప్పక మనోసిద్ధి నెరవేరగలదు. అన్ని కష్టములూ తొలగిపోయి అష్టైశ్వర్యములు లభించగలవు.

*॥ సమస్త సన్మంగళానిభవంతు ॥*

*శ్రీ లక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు*







# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## శ్రీ గణపతి ధ్యానము

వక్రతుండ మహాకాయ కోటిసూర్యసమప్రభ ।
నిర్విఘ్నం కురుమే దేవ సర్వకార్యేషు సర్వదా ।
శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే ॥
తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి ॥

## ఆచమనము

ఓం కేశవాయ స్వాహా ।
ఓం నారాయణాయ స్వాహా ।
ఓం మాధవాయ స్వాహా ।
ఓం గోవిందాయ నమః ।
ఓం విష్ణవే నమః ।
ఓం మధుసూదనాయ నమః ।
ఓం త్రివిక్రమాయ నమః ।
ఓం వామనాయ నమః ।
ఓం శ్రీధరాయ నమః ।
ఓం హృషీకేశాయ నమః ।
ఓం పద్మనాభాయ నమః ।
ఓం దామోదరాయ నమః ।
ఓం సంకర్షణాయ నమః ।
ఓం వాసుదేవాయ నమః ।
ఓం ప్రద్యుమ్నాయ నమః ।
ఓం అనిరుద్ధాయ నమః ।
ఓం పురుషోత్తమాయ నమః ।
ఓం అధోక్షజాయ నమః ।
ఓం నారసింహాయ నమః ।
ఓం అచ్యుతాయ నమః ।
ఓం జనార్దనాయ నమః ।
ఓం ఉపేంద్రాయ నమః ।
ఓం హరయే నమః ।
ఓం శ్రీకృష్ణాయ నమః ॥

## భూతోచ్చాటనము

ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః ఏతే భూమి భారకాః ।
ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

(అక్షతలు వెనుకకు వేయవలెను. అనంతరం కుడిచేతితో ముక్కు మూసుకొని ప్రాణాయామము చేయవలయును.)



## ప్రాణాయామము

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్, ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥

మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్త మానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వన్తరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోఃదక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ........ (శ్రీశైలానికి వ్రతం చేసేవారి ఊరు ఏ దిక్కులో ఉందో, ఆ దిక్కు చెప్పాలి) ప్రదేశే, కృష్ణా, గోదావరీ మధ్యభాగే (ఏ నదుల మధ్యప్రాంతంలో వుంటే ఆ నదుల పేర్లు చెప్పవలెను.) స్వ / శోభన గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ, హరిహర సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన స్వస్తిశ్రీ ప్రభవాది నామ సంవత్సర మధ్య (ప్రస్తుతం జరుగుతున్న సంవత్సరం, ఆయనం, ఋతువు, మాసం, పక్షం, తిథి, వారములను క్రమంగా చేర్చి చెప్పుకోవలెను.) సంవత్సరే ఆయనే... ఋతౌ... మాసే... పక్షే... తిథౌ వాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ .... గోత్రః.... నామధేయః ధర్మపత్నీ సమేతస్య అస్మాకం సహకుటుంబానాం, క్షేమ, స్థైర్య, ధైర్య, విజయ, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీవేంకటేశ్వర దేవతా ముద్దిశ్య శ్రీవేంకటేశ్వర వ్రతకల్ప కరిష్యే ద్రవ్యైః సమ్భవద్భిః పదార్థై సమ్భవతా నియమేన యావచ్ఛక్తి ధ్యానా వాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ (నీటిని స్పృశించాలి)

## తదంగ కలశారాధనం కరిష్యే

(ఉదకమును వదలవలయును, సంకల్పమునకూ, ఆచమనమునకూ వాడు పాత్రను కలశారాధనమునకు వాడరాదు. స్వామికి కుడివైపున కలశము నుంచి దానికి గంధం, కుంకుమ, అక్షతలూ మూడూ ఉంచి కలశంలో పువ్వు వేసి క్రింది శ్లోకాన్ని చెప్పవలయును.)

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాః శ్రితాః ॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదో౽థ యజుర్వేదః సామవేదోహ్యథర్వణః ॥
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ।
కలశే గంధ పుష్పాక్షతాన్ నిక్షిప్య, హస్తేనాచ్ఛాద్య,

ఆపో వా ఇదగ్‌ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణవా ఆపః పశవ ఆపోన్న మాపోమృత మాప స్సమ్రాడాపో విరాడాప స్వరాడాపశ్ఛందాగ్‌ం స్యాపో జ్యోతీగ్‌ం ష్యాపో యజూగ్‌ంష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా అపోభూర్భువస్సువ రాప ఓమ్.
(కలశాన్ని ఉదకంతో నింపి అందులో తులసీదళాన్ని వేయవలయును.)

శ్లో॥ గంగే! చ యమునే! కృష్ణే! గోదావరి! సరస్వతి!
నర్మదే! సింధుకావేర్యౌ! జలే౽స్మిన్ సన్నిధిం కురు ॥
కావేరీ తుంగ భద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ
భాగీరథీ చ విఖ్యాతా పంచగంగా ప్రకీర్తితాః
కలశోదకేన దేవమాత్మానం పూజాద్రవ్యాణి చ సంప్రోక్ష్య

(కలశమునందలి ఉదకాన్ని పువ్వుతో స్వామిపైననూ, పూజాద్రవ్యాలపైన, తమపైన చల్లుకోవాలి.)

## శ్రీ గణపతి ప్రార్థన

శుక్లాంభరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ స్సర్వవిఘ్నోపశాంతయే ॥
ఆదౌ నిర్విఘ్నేన వ్రత పరిసమాప్త్యర్థం గణపతి పూజాం కరిష్యే ॥

## అథ గణపతిపూజా

ఓం గణానాం త్వా గణపతిగ్‌ం హవామహే । కవిం కవీనాముప మశ్రవస్తవమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత । ఆనశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనమ్ ॥
శ్రీ మహాగణాధిపతయే నమః - ధ్యాయామి, ధ్యానం సమర్పయామి ॥




ఆవాహయామి, రత్నసింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయో రర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి॥

ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన, మహేరణాయ చక్షసే,
యో వశ్శివత మోరసస్తస్య భాజయతేహనః ఉశతీరిన మాతరః
తస్మాఅరం గమామవో యస్యక్షయాయ జిన్వథ, అపోజనయథాచనః
శ్రీ మహాగణాధిపతయే నమః - శుద్ధోదకస్నానం సమర్పయామి ॥
స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి ॥

అభివస్త్రాసు వసనాన్యర్ షాభిదేనూస్సు దుఘాః పూజమానః ।
అభిచంద్రా భర్త వే నో హిరణ్యాభ్యశ్వాన్‌రథినోదేవ సోమ ॥
శ్రీ మహాగణాధిపతయేనమః - వస్త్రయుగ్మం సమర్పయామి ॥

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్ ।
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥
శ్రీ మహాగణాధిపతయేనమః - యజ్ఞోపవీతం సమర్పయామి ॥

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం ।
ఈశ్వరీగ్‌ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియమ్ ॥
శ్రీ మహాగణాధిపతయేనమః - దివ్య శ్రీ చందనం సమర్పయామి ॥

ఆయనే తే పరాయణే దుర్వా రోహంతు పుష్పిణీః ।
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥
శ్రీ మహాగణాధిపతయేనమః - దూర్వాది నానావిధ పుష్పాణి సమర్పయామి ॥

## అథ శ్రీ షోడశనామ పూజా

| | |
|---|---|
| ఓం సుముఖాయ నమః । | ఓం వికటాయ నమః । |
| ఓం ఏకదంతాయ నమః । | ఓం విఘ్నరాజాయ నమః । |
| ఓం కపిలాయ నమః । | ఓం గజాధిపతయే నమః । |
| ఓం గజకర్ణికాయ నమః । | ఓం ధూమకేతవే నమః । |
| ఓం లంబోదరాయ నమః । | ఓం గణాధ్యక్షాయ నమః । |




ఓం ఫాలచంద్రాయ నమః ।
ఓం గజాననాయ నమః ।
ఓం వక్రతుండాయ నమః ।
ఓం శూర్పకర్ణాయ నమః ।
ఓం హేరంబాయ నమః ।
ఓం స్కందపూర్వజాయ నమః ।
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః ।
శ్రీ మహాగణాధిపతయే నమః ।

## నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి

వనస్పత్యుద్భవైర్దివ్యై నానా గంధైస్సు సంయుతం ।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతామ్ ॥

*శ్రీ మహాగణాధిపతయే నమః – ధూపమాఘ్రాపయామి ॥*

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియమ్ ।
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరాపహమ్ ॥
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే ।
త్రాహి మాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోస్తుతే ॥

*శ్రీ మహాగణాధిపతయే నమః – దీపం సమర్పయామి,*
*ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి.*

## నైవేద్యము

చిన్న బెల్లపుముక్క ఉంచి దానిచుట్టూ నీళ్ళు చల్లి సంప్రోక్షించుచూ,

**ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్**

**సత్యం త్వర్తేన పరిషించామి** (ఋతం త్వా సత్యేన పరిషించామి అని రాత్రి చెప్పవలెను.)

*శ్రీ మహాగణాధిపతయే నమః – గుడోపహారనైవేద్యం సమర్పయామి ॥*
అమృతమస్తు అమృతోపస్తరణమసి

**ప్రసాదం తయారు చేయు విధానం:–** ముందుగా సన్నని గోదుమ రవ్వని నెయ్యి(Ghee) లో దోరగా వేయించుకోవాలి. ఆ తరువాత వేయించిన రవ్వని చల్లారబెట్టి దీనిలో పంచదార (Sugar) పొడిని వేసి కలపాలి. తరువాత అరటిపండును వేసి కలిపి స్వామి వారి ముందు నైవేద్యంగా పెట్టాలి. ఈ ప్రసాదం మరింత రుచి పెరగటానికి ఇలాచి పొడి వేసి కలుపుకోవచ్చు.




ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ॥

అమృతాపిధాన మసి ఉత్తరాపోశనం సమర్పయామి ।
హస్తౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి ।
పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

*తాంబూలం సమర్పయామి ॥*

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే । కవిం కవీనాముప మశ్రవస్తవమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత । ఆనశ్శృణ్వన్నూతిభి స్సీదసాదనమ్ ॥

*శ్రీ మహాగణాధిపతయే నమః – సువర్ణమంత్రపుష్పం సమర్పయామి ॥*

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప ।
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే ॥
యజ్ఞేన యజ్ఞమయ జంత దేవా స్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ తేహనాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వేసాధ్యా స్సంతిదేవాః ॥

## పునరాచమనమ్

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీమహాగణాధిపతి సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్య విఘ్నమస్త్వితి భవంతో బ్రువంతు ఉత్తరే కర్మణ్య విఘ్నమస్తు గణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి ॥

సహస్రపరమా దేవీ శతమూలా శతాంకురా ।
సర్వగ్ం హరతు మే పాపం దూర్వాదుస్స్వప్ననాశనీ ।
గణపతిం యథాస్థానము ద్వాసయామి ॥

## ప్రాణప్రతిష్ఠ

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః
ప్రాణమిహనోదేహి భోగం జ్యోక్పశ్యేమ
సూర్యముచ్చరన్త మనుమతే మృడయాన స్వస్తి
అమృతం వై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ
యథాస్థానముపహ్వాయతే (ప్రతిమను స్పృశించాలి)




శ్రీ వేంకటేశ్వరస్వామి  ఆవాహయామి, స్థాపయామి, పూజయామి

స్థిరోభవ, వరదోభవ సుప్రసన్నోభవ, స్థిరాసనం కురు ।

## ధ్యానమ్

**శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం ।**

**విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్ ॥**

**లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృధ్యాన గమ్యమ్ ।**

**వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ।**

**వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – ధ్యాయామి, ధ్యానం సమర్పయామి (పుష్పాన్నైనా పత్రాన్నైనా ఉంచవలెను.)*

## ఆవాహనమ్

**ఆవాహయామి దేవేశ సిద్ధగన్ధర్వ సేవిత ।**

**యద్రహస్యమిదం పుణ్యం సర్వపాపహరోహరః ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – ఆవాహయామి (పుష్పాన్నైనా, పత్రాన్నైనా ఉంచవలెను.)*

## ఆసనమ్

**దేవదేవ జగన్నాథ ప్రణత క్లేశనాశన ।**

**రత్నసింహాసనం దివ్యం గృహాణ మధుసూదన ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – రత్నసింహాసనం సమర్పయామి (పుష్పపత్రాలలో దేన్నైనా ఉంచవలెను.)*

## పాద్యమ్

**వాంఛితం కురుమేదేవ దుష్కృతం చ వినాశయ ।**

**పాద్యం గృహాణ భగవాన్ మాతురుత్సఙ్గ సంస్థిత ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – పాదయో, పాద్యం సమర్పయామి (నీటిని పళ్ళెంలో విడువవలయును.)*



## అర్ఘ్యమ్

**కురుష్వమే దయాం దేవ సంసారార్తి భయాపహ ।**

**దధిక్షీర ఫలోపేతం గృహాణార్ఘ్యం నమోస్తుతే ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – హస్తయోరర్ఘ్యం సమర్పయామి (ఉదకాన్ని పళ్లెంలో విడువవలయును.)*

## ఆచమనమ్

**నమ స్సత్యాయ శుద్ధాయ నిత్యాయ జ్ఞానరూపిణే ।**

**గృహాణాచమనం దేవ సర్వలోకైక నాయక ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – ముఖే ఆచమనీయం సమర్పయామి. (నీటిని పళ్ళెంలో విడువవలయును.)*

## పంచామృతస్నానమ్

**పంచామృతం మయానీతం పయోదధిఘృతమ్ మధు ।**

**శర్కరా సహితం చైవదేవత్వం ప్రతిగృహ్యతామ్ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – పంచామృత స్నానం సమర్పయామి)*

(పంచామృతములనగా ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార నీరు కలిసినవి వీటితో స్వామిని అభిషేకించాలి.)

## స్నానమ్

**స్వర్ణపాత్రోదకం గంగా యమునాది సమన్వితమ్ ।**

**శుద్ధోదకం గృహాణేశ స్నానం కురు యథావిధి ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – శుద్ధోదకస్నానం సమర్పయామి (ఉదకమును విడువవలయును.)*

## వస్త్రమ్

**తప్తకాంచన సంకాశం పీతాంబర మిదం హరే ।**

**సుగృహాణ జగన్నాథ శ్రీనివాస నమోస్తుతే ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః - వస్త్రయుగ్మం సమర్పయామి (వస్త్రయుగ్మం సమర్పించనిచో ప్రత్తినే కొద్ది పొడవుగా చేసి పసుపు, కుంకుమలు అంటించి సమర్పించవచ్చును.)*

## యజ్ఞోపవీతమ్

**యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।**

**ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః - యజ్ఞోపవీతం సమర్పయామి (ప్రత్తి నుంచి పోగు లాగి పసుపు కుంకుమలు అంటించి, అటువంటివి రెండింటిని సమర్పించవలయును. యజ్ఞోపవీతార్థం పుష్పం అని పువ్వు వెయ్యవచ్చును.)*

## గంధమ్

**చందనాగరు కస్తూరీ ఘనసార సమన్వితమ్ ।**

**గంధం గృహాణ గోవింద నానాగంధాశ్చధారయ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః - దివ్యపరిమళ గన్ధాన్ సమర్పయామి (చందనమును సమర్పించవలయును.)*

## అక్షతాన్

**గోవిందా పరమానంద హరిద్రా సహితాక్షతాన్ ।**

**విశ్వేశ్వర విశాలాక్ష గృహాణ పరమేశ్వర ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః - అక్షతాన్ సమర్పయామి (అక్షతలు వేయవలెను.)*

## పుష్పమ్

**సుగంధీని సుపుష్పాణి జాజీకుందముఖానిచ ।**

**మాలతీ వకుళాదీని పూజార్థం ప్రతిగృహ్యతామ్ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః - పుష్పం సమర్పయామి (పుష్పములు వేయవలెను.)*



## అథాంగపూజ

ఓం శ్రీ వేంకటేశ్వరాయ నమః - పాదౌ పూజయామి ।

ఓం శ్రీవేంకటాచలదీశాయ నమః - గుల్ఫౌ పూజయామి ।

ఓం శ్రీ ప్రదాయకాయ నమః - జానునీ పూజయామి ।

ఓం పద్మావతీ పతయే నమః - జంఘే పూజయామి ।

ఓం జ్ఞానప్రదాయ నమః - ఊరూ పూజయామి ।

ఓం శ్రీనివాసాయ నమః - కటిం పూజయామి ।

ఓం మహాభాగాయ నమః - నాభిం పూజయామి ।

ఓం నిర్మలాయ నమః - ఉదరం పూజయామి ।

ఓం విశాల హృదయాయ నమః - హృదయం పూజయామి ।

ఓం పరిశుద్ధాత్మనే - స్తనౌ పూజయామి ।

ఓం పురుషోత్తమాయ నమః - భుజౌ పూజయామి ।

ఓం స్వర్ణహస్తాయ నమః - హస్తౌ పూజయామి ।

ఓం వరప్రదాయ నమః - కంఠం పూజయామి ।

ఓం లోకనాథాయ నమః - స్కంధౌ పూజయామి ।

ఓం సర్వేశ్వరాయ నమః - ముఖం పూజయామి ।

ఓం రసజ్ఞాయ నమః - నాసికాం పూజయామి ।

ఓం పుణ్యశ్రవణ కీర్తనాయ నమః - శ్రోత్రే పూజయామి ।

ఓం ఫుల్లాంబుజ విలోచనాయ నమః - నేత్రే పూజయామి ।

ఓం వర్చస్వినే నమః - లలాటం పూజయామి ।

ఓం రమ్య విగ్రహాయ నమః - సర్వాణ్యంగాని పూజయామి ।

ఓం శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర పరమాత్మనే నమః - దివ్యసుందర విగ్రహం పూజయామి ॥

# శ్రీ వేంకటేశ అష్టోత్తర శతనామావళి

**(ప్రతి నామమునకు ముందు 'ఓం' అని. చివర 'నమః' అని పఠింపవలెను)**

ఓం వేంకటేశాయ నమః
శ్రీనివాసాయ
లక్ష్మీపతయే
అనామయాయ
అమృతాశాయ
జగద్వంద్యాయ
గోవిందాయ
శాశ్వతాయ
ప్రభవే
శేషాద్రినిలయాయ 10
దేవాయ
కేశవాయ
మధుసూదనాయ
అమృతాయ
మాధవాయ నమః
కృష్ణాయ
శ్రీహరయే
జ్ఞానపంజరాయ
శ్రీవత్సవక్షసే
సర్వేశాయ 20
గోపాలాయ
పురుషోత్తమాయ
గోపీశ్వరాయ
పరంజ్యోతిషే
వైకుంఠపతయే
అవ్యయాయ

ఓం సుధాతనవే నమః
యాదవేంద్రాయ
నిత్యయౌవనరూపవతే
చతుర్వేదాత్మకాయ
విష్ణవే
అచ్యుతాయ
పద్మినీప్రియాయ
ధరాపతయే
సురపతయే
నిర్మలాయ
దేవపూజితాయ
చతుర్భుజాయ
చక్రధరాయ
త్రిధామ్నే 40
త్రిగుణాశ్రయాయ
నిర్వికల్పాయ
నిష్కళంకాయ
నిరాతంకాయ
నిరంజనాయ
నిరాభాసాయ
నిత్యతృప్తాయ నమః
నిర్గుణాయ
నిరుపద్రవాయ
గదాధరాయ 50
శార్ఙ్గపాణయే
నందకినే




ఓం శంఖధారకాయ నమః
అనేకమూర్తయే
అవ్యక్తాయ
కటిహస్తాయ
వరప్రదాయ
అనేకాత్మనే
దీనబంధవే
ఆర్తలోకభయప్రదాయ
ఆకాశరాజవరదాయ
యోగిహృత్పద్మమందిరాయ
దామోదరాయ
జగత్పాలాయ
ఓం పాపఘ్నాయ నమః
భక్తవత్సలాయ
త్రివిక్రమాయ
శింశుమారాయ
జటామకుటశోభితాయ
శంఖమధ్యోల్లసన్మంజు
–కింకిణ్యాఢ్యకరండకాయ 70
నీలమేఘశ్యామతనవే
బిల్వపత్రార్చనప్రియాయ
జగద్వ్యాపినే
జగత్కర్త్రే
జగత్సాక్షిణే
జగత్పతయే
చింతితార్థప్రదాయ
జిష్ణవే
దాశార్హాయ
దశరూపవతే

ఓం దేవకీనందనాయ నమః
శౌరయే నమః
హయగ్రీవాయ
జనార్దనాయ
కన్యాశ్రవణతారేజ్యాయ
పీతాంబరధరాయ
అనఘాయ
వనమాలినే
పద్మనాభాయ
మృగయాసక్తమానసాయ 90
అశ్వారూఢాయ
ఖడ్గధారిణే
ధనార్జనసముత్సుకాయ
ఘనసారలసన్మధ్యకస్తూరీ
–తిలకోజ్జ్వలాయ
సచ్చిదానందరూపాయ
జగన్మంగళదాయకాయ
యజ్ఞరూపాయ
యజ్ఞభోక్త్రే
చిన్మయాయ నమః
పరమేశ్వరాయ 100
పరమార్థప్రదాయ
శాంతాయ
శ్రీమతే
దోర్దండవిక్రమాయ నమః
పరాత్పరాయ
పరబ్రహ్మణే
శ్రీవిభవే
జగదీశ్వరాయ 108

*॥ ఇతి శ్రీ వేంకటేశ్వర అష్టోత్తరశతనామావళిః ॥*




# శ్రీ మహాలక్ష్మీ అష్టోత్తర శతనామావళి

**(ప్రతి నామమునకు ముందు 'ఓం' అని. చివర 'నమః' అని పఠింపవలెను)**

ఓం ప్రకృత్యై నమః
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై
శ్రద్ధాయై
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై
వాచ్యై
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే
స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయ్యై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై 20
అదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై

ఓం కాంతాయై నమః
కామాయై
క్షీరోదసంభవాయై
అనుగ్రహప్రదాయై 30
బుద్ధయే
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై
దీప్తాయై
లోకశోకవినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే 40
పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై 50
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై




ఓం సుప్రసన్నాయై నమః
ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై నమః
చంద్రవదనాయై
చంద్రాయై
చంద్రసహోదర్యై
చతుర్భుజాయై 60
చంద్రరూపాయై
ఇందిరాయై
ఇందుశీతలాయై
ఆహ్లోదజనన్యై
పుష్ట్యై
శివాయై
శివకర్యై
సత్యై
విమలాయై
విశ్వజనన్యై 70
తుష్ట్యై
దారిద్ర్యనాశిన్యై
ప్రీతిపుష్కరిణ్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై 80
వసుంధరాయై

ఓం ఉదారాంగాయై నమః
హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై
సిద్ధయే
స్త్రైణసౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానందాయై
వరలక్ష్మ్యై 90
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై
మంగళాదేవ్యై
విష్ణువక్షఃస్థల స్థితాయై
విష్ణుపత్న్యై
ప్రసన్నాక్ష్యై
నారాయణ సమాశ్రితాయై 100
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మవిష్ణుశివాత్మికాయై
త్రికాలజ్ఞాన సంపన్నాయై
భువనేశ్వర్యై 108

**॥ ఇతిశ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళిః ॥**




# శ్రీ పద్మావతీ అష్టోత్తర శతనామావళి

**(ప్రతి నామమునకు ముందు 'ఓం' అని. చివర 'నమః' అని పఠింపవలెను)**

ఓం పద్మావత్యై నమః
దేవ్యై
పద్మోద్భవాయై
కరుణప్రదాయిన్యై
సహృదయాయై
తేజస్వరూపిణ్యై
కమలముఖై
పద్మధరాయ
శ్రియై
పద్మనేత్రే
పద్మకరాయే
సుగుణాయై
కుంకుమప్రియాయై
హేమవర్ణాయై
చంద్రవందితాయై
ధగధగప్రకాశ శరీరధారిణ్యై
విష్ణుప్రియాయై
నిత్యకల్యాణ్యై
కోటిసూర్యప్రకాశిన్యై
మహా సౌందర్యరూపిణ్యై
భక్తవత్సలాయై
బ్రహ్మాండవాసిన్యై
సర్వవాంచాఫలదాయిన్యై
ధర్మసంకల్పాయై
దాక్షిణ్యకటాక్షిణ్యై
భక్తిప్రదాయిన్యై
గుణత్రయవివర్జితాయై
కళాషోడశసంయుతాయై
సర్వలోకానాంజనన్యై

ఓం ముక్తిదాయిన్యై నమః
దయామృతాయాయై
ప్రాజ్ఞాయై
మహాధర్మాయై
ధర్మరూపిణ్యై
అలంకార ప్రియాయై
సర్వదారిద్ర్యధ్వంసిన్యై
శ్రీవేంకటేశవక్షస్థలస్థితాయై
లోకశోకవినాశిన్యై
వైష్ణవ్యై
తిరుచానూరుపురవాసిన్యై
వేదవేద్యవిశారదాయై
విష్ణుపాద సేవితాయై
రత్నప్రకాశకిరీటధారిణ్యై
జగన్మోహిన్యై
శక్తిస్వరూపిణ్యై
ప్రసన్నోదయాయై
ఇంద్రాదిదైవత యక్షకిన్నెర
–కింపురుష పూజితాయై
సర్వలోకనివాసిన్యై
భూజయాయై
ఐశ్వర్యప్రదాయిన్యై
శాంతాయై
ఉన్నతస్థానస్థితాయై
మందారకామిన్యై
కమలాకరాయై
వేదాంతజ్ఞానరూపిణ్యై
సర్వసంపత్తిరూపిణ్యై
కోటిసూర్యసమప్రభాయై




ఓం పూజఫలదాయిన్యై నమః
కమలాసనాది సర్వదేవతాయై
వైకుంఠవాసిన్యై
అభయదాయిన్యై
ద్రాక్షాఫలపాయసప్రియాయై
నృత్యగీతప్రియాయై
క్షీరసాగరోద్భవాయై
ఆకాశరాజ పుత్రికాయై
సువర్ణహస్తధారిణ్యై
కామరూపిణ్యై
కరుణాకటాక్షధారిణ్యై
అమృతాసుజాయై
భూలోకస్వర్గసుఖదాయిన్యై
అష్టదిక్పాలకాధిపత్యై
మన్మధదర్ప సంహార్యై
కమలార్ధభాగాయై
స్వల్పపరాధ –
మహాపరాధక్షమాయై
షట్కోటితీర్థవాసితాయై
నారదాది మునిశ్రేష్ఠ పూజితాయై
ఆదిశంకరపూజితాయై
ప్రీతిదాయిన్యై
సౌభాగ్యప్రదాయిన్యై
మహాకీర్తి ప్రదాయిన్యై
కృష్ణాతిప్రియాయై
గంధర్వ శాపవిమోచకాయై
కృష్ణపత్న్యై
త్రిలోకపూజితాయై
జగన్మోహిన్యై
సులభాయై
సుశీలాయై
అంజనాసుతానుగ్రహప్రదాయిన్యై

ఓం భక్త్యాత్మనివాసిన్యై నమః
సంధ్యావందిన్యై
సర్వలోకమాత్రై
అభిమతదాయిన్యై
లలితావధూత్యై
సమస్తశాస్త్ర విశారదాయై
సువర్ణాభరణధారిణ్యై
ఇహపరలోక సుఖప్రదాయిన్యై
కరవీరనివాసిన్యై
నాగలోకమణిసహా ఆకాశసింధు
కమలేశ్వర పూరితరథగమనాయై
శ్రీ శ్రీనివాసప్రియాయై
చంద్రమండలస్థితాయై
అలివేలు మంగాయై
దివ్యమంగళ ధారిణ్యై
సుకళ్యాణపీఠస్థితాయై
కామకవనపుష్పప్రియాయై
కోటి మన్మధరూపిణ్యై
భానుమండలరూపిణ్యై
పద్మపాదాయై
రమాయై
సర్వలోకసభాంతర ధారిణ్యై
సర్వమానసవాసిన్యై
సర్వాయై
విశ్వరూపాయై
దివ్యజ్ఞానాయై
స్వమంగళరూపిణ్యై
సర్వానుగ్రహప్రదాయిన్యై
ఓంకారస్వరూపిణ్యై
బ్రహ్మజ్ఞానసంభూతాయై
శ్రీ పద్మావత్యై
సద్యోవేదవత్యై
శ్రీమహాలక్ష్మ్యై




## ధూపమ్

**దశాంగం గుగ్గులోపేతం గోఘృతేన సమన్వితమ్ ।**

**ధూపం గృహాణ దేవేశ సర్వలోక నమస్కరా ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – ధూపమాఘ్రాపయామి (ధూపమును సమర్పించవలెను.)*

## దీపమ్

**త్రిలోకేశ మహాదేవ సర్వజ్ఞాన ప్రదాయక ।**

**దీపం దాస్యామి దేవేశ రక్షమాం భక్తవత్సల ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – దీపం దర్శయామి (దీపాన్ని చూపవలెను.)*

## నైవేద్యమ్

**సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైష్షడ్భి స్సమన్వితమ్ ।**

**నైవేద్యంతు మయానీతం గృహాణ పురుషోత్తమ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – నైవేద్యం సమర్పయామి (నైవేద్యమును సమర్పించాలి. అరటిపండ్లయితే కదళీఫలం కొబ్బరి నారికేళ ఫలం నివేదయామి అనియు బెల్లం ముక్క అయితే గుడోపహార నైవేద్యం సమర్పయామి అని చెప్పవలెను.)*

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయస్వాహా, ఓం పరబ్రహ్మణే స్వాహా (ఉదకమును ప్రోక్షిస్తూ) ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్, ఓమాపో జ్యోతీరాపో మృతం బ్రహ్మ భూర్భువస్సువరోం (స్వామికి చేతితో చూపవలెను.)

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి

(ఉదకమును విడిచిపెట్టవలయును.)



అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, పునరాచమనీయం సమర్పయామి.

## తాంబూలమ్

**పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతమ్ ।**

**ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – తాంబూలం సమర్పయామి.*

## నీరాజనమ్

**శ్రియః కాన్తాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।**

**శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – నీరాజనం దర్శయామి (నీరాజనం సమర్పించి ఉద్ధరిణితో ఉదకాన్ని తీసికొని, నీరాజనానంతరం పునరాచమనీయం సమర్పయామి. (అని ఉదకాన్ని వీడవలయును.)*

## మంత్రపుష్పమ్

**ఓమ్॥ సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।**
**విశ్వం నారాయణన్దేవమ్ అక్షరం పరమం పదమ్ ॥** ౧

**విశ్వతః పరమా న్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।**
**విశ్వ మేవేదం పురుషస్తద్విశ్వ ముపజీవతి ॥** ౨

**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివ మచ్యుతమ్ ।**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥** ౩

**నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః ।**
**నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః ।**
**నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః ॥** ౪

**యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।**
**అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥** ౫

అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేఽన్తం విశ్వ శంభువమ్ ।
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్ ॥ ౬

అధో నిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరి తిష్ఠతి ।
జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాఽయతనం మహత్ ॥ ౭

సన్తతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశసన్నిభమ్ ।
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్ ॥ ౮

తస్య మధ్యే మహానగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః ।
సోఽగ్రభుగ్విభజన్ తిష్ఠ న్నాహార మజరః కవిః ।
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతా ॥ ౯

సన్తాపయతి స్వం దేహ మాపాదతల మస్తకః ।
తస్య మధ్యే వహ్ని శిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః ॥ ౧౦

నీలతో యదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవారశూకవత్తన్వీ పీతాభా స్వత్యణూపమా ॥ ౧౧

తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః ।
స బ్రహ్మ స శివ స్సహరి స్సేన్ద్ర స్సోఽక్షరః పరమస్స్వరాట్ ॥ ౧౨

ఓం తద్బ్రహ్మ । ఓం తద్వాయుః । ఓం తదాత్మా । ఓం తత్సత్యం ।
ఓం తత్సర్వం । ఓం తత్పురోర్నమః ।
అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు ।
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వమింద్రస్త్వగ్ం
రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః ।
త్వం తదాప ఆపో జ్యోతీ రసోఽ మృతం
బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥ ౧౩

గదా పునశ్శజ్గరధాజ్గకల్పక ధ్వజారవిన్దాఙ్కుశ వజ్రలలాశ్చిత
హే శ్రీనివాస త్వచ్చరణామ్బుజ ద్వయం మదీయ మూర్ధాన మలజ



ఓం నిరంజనాయ విద్మహే నిరాభాసాయ ధీమహి
తన్నో శ్రీనివాసః ప్రచోదయాత్

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీవేంకటేశ్వరస్వామినే నమః – సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి ॥*

## ప్రదక్షిణ నమస్కారమ్

శ్లో॥ యానికాని చ పాపాని జన్మాన్తర కృతాని చ ।
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ॥
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసమ్భవః ।
త్రాహిమాం కృపమయా దేవ శరణాగతవత్సల ॥
అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్దన ॥

*శ్రీ లక్ష్మీపద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి (పై మంత్రాన్ని పఠించుచూ స్వామినే స్మరిస్తూ మూడుసార్లు ప్రదక్షిణలు చేసి, సాష్టాంగ నమస్కారం చేసి, పిమ్మట వివిధోపచార పూజను చేయవలెను.)*

## వివిధోపచార పూజలు

ఛత్ర ధారయామి । చామరం వీజయామి । నృత్యం దర్శయామి । గీతం శ్రావయామి । వాద్యం ఘోషయామి । ఆందోళికాన్ ఆరోహయామి । అశ్వానారోహయామి । గజానారోహయామి । సమ్త రాజోపచార, శక్త్యుపచార, యంత్రోపచార, దేవోపచార, సర్వోపచార పూజాం సమర్పయామి ॥

## క్షమార్పణమ్

మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన ।
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే ॥ *(నమస్కరించవలెను.)*

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ భగవాన్ సర్వాత్మకః శ్రీలక్ష్మీపద్మావతీ సమేత శ్రీవేంకటేశ్వర స్వరూపో భగవాన్ సుప్రీత సుప్రసన్నో వరదో భవతు. శ్రీవేంకటేశ్వర దేవప్రసాదం శిరసా గృహ్ణామి.

## తీర్థం పుచ్చుకొనుట

అకాల మృత్యుహరణం సర్వవ్యాధి నివారణమ్ ।
సర్వ పాపక్షయకరం దేవ పాదోదకం పావనం శుభమ్ ॥

*(అనుచూ స్వామివారి పాదోదకాన్ని పుచ్చుకోవలెను.)*

నైవేద్యం – ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యంత్వర్తేన పరిషించామి, అమృతమస్తు అమృతోపస్తరణమసి, ఓం ప్రాణాయస్వాహా... ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మణే స్వాహా, శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామినే నమః – మహా నైవేద్యం సమర్పయామి॥

అమృతాపి ధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధ ఆచమనీయం సమర్పయామి ॥

తాంబూలం సమర్పయామి, సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి, ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, అనయాధ్యానా వాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీలక్ష్మీపద్మావతీ సమేత వేంకటేశ్వరస్వామి సుప్రీత సుప్రసన్నో వరదో భవతు శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత వేంకటేశ్వరస్వామి ప్రసాదం శిరసా గృహ్ణామి ॥

## ఉద్వాసనమ్

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।
తేహనాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతిదేవాః ॥
గచ్ఛ గచ్ఛ సురశ్రేష్ఠ స్వస్థాన శ్రీ వేంకటేశ్వర ।
భక్తాభీష్ట సమృద్ధ్యర్థం పునరాగమనాయ చ ॥

*(శ్రీలక్ష్మీపద్మావతీ సమేత శ్రీవేంకటేశ్వరస్వామి యథాస్థానం ఉద్వాసయామి)*





# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## -: ప్రథమ అధ్యాయము :-

### శ్రీభగవాన్ ఉవాచ

కలియుగములో ఒకానొక శుభముహూర్తమున సాక్షాత్ భూలోక వైకుంఠమే అయిన తిరుమలకొండపై 'విశ్వపతి' అను భక్తునికి శ్రీనివాసుని రూపంలో ప్రకటితమై శ్రీవేంకటేశ్వరునిగా భక్తులచే కొలువబడుతున్న శ్రీమన్నారాయణులవారు 'శ్రీవేంకటేశ్వరవ్రతకల్పం'గా ప్రసిద్ధి చెందిన ఈ వ్రతం గురించి గ్రంథం రచించవలసినదిగా అనుగ్రహించి, అనుజ్ఞ నిచ్చి, ఈవిధంగా చెప్పసాగారు. 'ఓయీ! ప్రియభక్తా! విశ్వపతి నామధేయా, నా ప్రియభక్తుడవయిన నీకు ఇప్పుడు ఒక విశేష వ్రతకల్పము గురించి వివరిస్తున్నాను. ఈ వ్రతము నాకు అత్యంత ప్రియమైనది. అందరునూ ఆచరించుటకు ఎంతో సులభతరమైనది.

కలియుగంలో మానవులు తమ తమ పూర్వజన్మ ఫలాలను అనుభవిస్తూ తిరిగి అనేక పాపకర్మలనాచరిస్తూ దుఃఖముల పాలవుతున్నారు. వీరిలో నా భక్తులైన కొందరు వారి వారి కష్టాలను నివారించవలసిందిగా నన్ను వేడుకొంటున్నారు. ఎన్నో వ్యయప్రయాసలకోర్చి తిరుమలయాత్ర చేసి నన్ను దర్శించుకొంటున్నారు.

నా భక్తులనిన నాకు అత్యంత ప్రీతి. నామీదే పూర్తి భారం వేసి, ధర్మపథంలో జీవితం గడిపే వారి బాధ్యత నేనే వహిస్తాను. ఇప్పుడు నేను వివరిస్తున్న ఈ వ్రతం 'శ్రీవేంకటేశ్వర వ్రతకల్పం' అనే పేరుతో ప్రసిద్ధి పొందగలదు. ఈ వ్రతం నాకు అత్యంత ప్రియమైనది. ఈ వ్రతాన్ని భక్తిశ్రద్ధలతో ఎవరైతే ఆచరిస్తారో వారి ఈతిబాధలన్నీ తక్షణమే నివృత్తి కాగలవు. ఈ వ్రతము ఎవరైననూ, ఎప్పుడైననూ ఆచరించవచ్చును. ప్రత్యేకించి మార్గశిర, మాఘ, కార్తీక మాసములయందుగానీ, పౌర్ణమి, పంచమి, సప్తమి, ఏకాదశి తిథులయందుగానీ, శ్రవణా, స్వాతి నక్షత్రము రోజులయందుగానీ ఆచరించిన మిక్కిలి ఫలదాయకము.

కలియుగములో నా భక్తులైన మీరు అనుభవిస్తున్న కష్టములన్నీ నాకు తెలియును. మీకు ఎప్పుడు ఏ కష్టమొచ్చినా, ఏ ఆర్థిక సమస్యలుగానీ, ఆరోగ్య సమస్యలుగానీ, ఉద్యోగ, వ్యాపార సమస్యలుగానీ కలిగి మనశ్శాంతి లేనప్పుడు ఈ వ్రతము ఆచరించినయెడల తక్షణమే ఆయా సమస్యలన్నీ తొలగిపోగలవు. మరియూ మీరు మీ ఇంట ఏ శుభకార్యము తలపెట్టినను, ఈ వ్రతము ఆచరించిన ఎడల ఆ శుభకార్యము నిర్విఘ్నముగా జరిగి వేయిరెట్లు శుభప్రదము కాగలదు. ఈ వ్రతము ఆచరించిన వెంటనే సకల సుఖశాంతులు, అష్టైశ్వర్యములు లభించగలవు.

ఉదయమునగానీ, సాయంకాల సమయమందుగానీ ఈ వ్రతము ఆచరించవచ్చును. ఈ వ్రతము ఐదు అధ్యాయాలతో కూడుకొన్నది. ఈ ఐదు అధ్యాయములనూ భక్తితో పఠించవలెను. మీ స్వగృహమందుగానీ, వసతి గృహమందుగానీ, నా ఆలయములందుగానీ, ఏ పుణ్యక్షేత్రమునందుగానీ, నదీతీరమునగానీ ఈ వ్రతమును ఆచరించవచ్చును.

మీరు వీలైనచో మీ మీ బంధుమిత్రసపరివారాన్నంతా ఆహ్వానించి, ఈ వ్రతము ఆచరించినయెడల మిక్కిలి శ్రేయోదాయకము. ఈ వ్రతము ఆచరించినవారికినీ, విన్నవారికినీ, ప్రసాదమును భక్తితో స్వీకరించినవారికినీ అష్టైశ్వర్యములు కలుగగలవు. ఈ వ్రతమును పూర్వకాలములో నా ప్రియభక్తులైన ఎందరో మునీశ్వరులు ఆచరించి ఎన్నో దివ్యాశీస్సులు పొందినారు. భూలోకవాసులైన మీ అందరికీ ఈ వ్రతము మిక్కిలి ఆనందప్రదాయినియై అనేక శుభములను కలుగచేయును. ప్రశాంతచిత్తముతో నన్నే తలచుకొంటూ, ఈ వ్రతము ఆచరించిన యెడల వ్రతఫలము మిక్కిలిగా ఉండగలదు.

ఈ వ్రతము ఆచరించు విధానము మిక్కిలి సులభతరము. కలియుగములో మీకుగల కష్టములన్నియూ నాకు తెలియును. అందువలననే అత్యంత కఠోరనిష్టతో చేసే తపస్సులకు, యజ్ఞయాగాదులకు నిచ్చు ఫలము కేవలము ఈవ్రతము ఆచరించుటవలనే మీరు పొందగలరు.

ముందుగా వ్రతము ఆచరించు ప్రదేశమును చక్కగా శుభ్రపరచుకొనవలెను. మండపమును ఏర్పాటు చేసుకొని, నా ప్రియసఖులైన శ్రీదేవి, భూదేవిలతో కూడియున్న నా పటమును మండపముపై ఉంచవలెను. మండపమును గోడకు ఆన్చి ఉంచవచ్చును. మీకు ఇష్టమైన ఇతర దేవతల పటములు కూడా ఉంచుకొనవచ్చును. నవగ్రహదేవతలను, అష్టదిక్పాలకులను ఆవాహన చేసుకొనవలెను. లేదా వారందరికీ మనస్సులోనే నమస్కరించవచ్చును.



ముందుగా పసుపు వినాయకుని పూజింపవలెను. అటు తర్వాత ఈ వ్రతమునందలి అయిదు అధ్యాయములను భక్తిశ్రద్ధలతో పఠించవలెను. ఇదియే ప్రథమాధ్యాయము. మిగిలిన నాలుగు అధ్యాయములు నాకు అత్యంత ప్రీతిపాత్రులైన విశ్వామిత్ర, వశిష్ట, భరద్వాజ, అత్రిమునీశ్వరులు ప్రవచించారు. ఈ ఐదు అధ్యాయములను పఠించిన తర్వాత నాకు ప్రియమైన స్తోత్రములను పఠించవచ్చును. ప్రతీ అధ్యాయమునకు చివర **గోవిందా, గోవిందా, గోవిందా** అని మూడుసార్లు స్మరించవలెను.

ఈ కలియుగములో సామాన్య మానవులైన మీ అందరి కష్టాలూ నాకు తెలియును. కావున మరొక విశేషమును కూడా చెప్తున్నాను. ఈ వ్రతమును ఇంత వివరంగా చేసుకొనే శక్తి లేనివారు మీరు ఒక్కరే నా పటమును ఎదురుగా ఉంచుకొని, విఘ్నేశ్వరునికి, నవగ్రహదేవతలకు, అష్ట దిక్పాలకులకు మనసులోనే నమస్కరించి, ఈ ఐదు కథలనూ పఠించి, మీకు వీలున్న ఏ ఫలమునైనా నాకు నివేదించి ప్రసాదముగా స్వీకరించవచ్చును. ఈవిధంగా చేసినా కూడా మీ కార్యసిద్ధి కాగలదు. మీ కష్టములన్నీ తొలగిపోగలవు. మీకు సకలశుభాలూ కలుగగలవు.

"ఎవరైతే ఈ వ్రతాన్ని మిక్కిలి భక్తిశ్రద్ధలతో ఆచరించెదరో వారి యింటికి స్వయంగా నేనే ఏదో రూపంలో వచ్చి ప్రసాదాన్ని స్వీకరిస్తాను. నా అనుగ్రహం మీ అందరియందు నిరంతరమూ ఉంటుంది".

శ్రీ స్వామివారు తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి 'విశ్వపతి' అను భక్తునికి ఈవిధంగా తనకు అత్యంత ప్రీతికరమైన, తాను ఎల్లప్పుడూ నివసించే తిరుమలకొండపై ఈ వ్రత విధానమును అనుగ్రహించారు. కలియుగవాసులైన మనమందరమూ ఈ వ్రతాన్ని ఆచరించి, శ్రీవేంకటేశ్వర స్వామివారి అనుగ్రహానికి పాత్రులు కావలెను. ఈ వ్రతము ఆచరించినంతనే మన కష్టములన్నీ తొలగిపోయి, అనేక శుభఫలితములు పొందవచ్చును.

గోవిందా... గోవిందా... గోవిందా...

**॥ ప్రథమోధ్యాయము సమాప్తము ॥**

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥



# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## -: ద్వితీయ అధ్యాయము :-
## శ్రీ విశ్వామిత్ర ఉవాచ

ఈ అధ్యాయాన్ని మనకు మహాతపస్సంపన్నులైన సాక్షాత్తూ శ్రీవిశ్వామిత్రులవారు అనుగ్రహించారు. "ఓ కలియుగవాసులారా! శ్రీనివాసుని ప్రియభక్తులారా! మీరు ఆచరిస్తున్న ఈ "శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము" అతి పవిత్రమైనది. మహా మహిమాన్వితమైనది. కలియుగములో ఆ శ్రీమన్నారాయణుని కరుణా కటాక్షములు పొందడానికి మిక్కిలి సులభమార్గము. పూర్వము అనేకమంది శ్రీవారి భక్తులు ఈ వ్రతము ఆచరించి తమ తమ అభీష్టములను నెరవేర్చుకొనియున్నారు. ఇంత సులభతరమైన వ్రతకల్పము మనకు అనుగ్రహించిన శ్రీవేంకటేశ్వరస్వామివారికి ముందుగా మనమందరము నమస్కరించవలెను.

పూర్వకాలమున మగధ సామ్రాజ్యములో విష్ణుచిత్తుడనే శ్రీవారి ప్రియభక్తుడు ఉండేవాడు. అతనికి తొమ్మండుగురు స్త్రీ సంతానము కలిగినది. ఎంతో పాండిత్యము కలిగిననూ, మిక్కిలి పేదరికంతో బాధపడుతుండెడివాడు. విష్ణుచిత్తుని భార్య తారామతి ఎల్లప్పుడూ ఆ శ్రీమన్నారాయణుని పాదపద్మములయందే మనసు లగ్నం చేసి, ప్రార్థిస్తూ వుండేది.

అప్పుడప్పుడూ వివాహాది శుభకార్యాల పౌరోహిత్య కార్యక్రమాలలో దక్షిణగా వచ్చే కొద్దిపాటి సొమ్ముతో అష్టకష్టాలు పడుతూ సంసారం సాగిస్తున్నారు ఆ దంపతులు. కుమార్తెలకు యుక్తవయసు సమీపించినది. తారామతికి ఎప్పుడూ వీరి వివాహం ఏవిధంగా జరిపించవలెనా అని చింతిస్తూ, ఆ శ్రీనివాసున్నే ప్రార్థిస్తూ కాలం వెళ్లబుచ్చేది.

ఓ శ్రీనివాస భక్తులారా! ఆశ్రిత జనరక్షకుడైన శ్రీవేంకటేశ్వర స్వామివారికి తన భక్తులనిన అపార ప్రేమయని మనందరికీ తెలిసినదే కదా! ఆనాడు మాఘపౌర్ణమి. ఉదయాన్నే ఒక వృద్ధబ్రాహ్మణుడు విష్ణుచిత్తుని ఇంటి తలుపు తట్టాడు. అయ్యా! నేను వంగదేశపు వాసిని. ఒక యజ్ఞం నిమిత్తం వెళుతూ దారిమధ్యలో ఈ దేశం వచ్చాను. దయచేసి ఈ ఒక్కరోజు మీ ఇంట్లో ఉండనిచ్చినచో తిరిగి రేపు ఉదయాన్నే వెళ్లిపోగలను అని విష్ణుచిత్తుని అర్థించాడు. అందుకు విష్ణుచిత్తులు "స్వామీ! అంతకుమించిన అదృష్టము మాకేమున్నది? అతిథి సాక్షాత్తూ శ్రీమన్నారాయణునితో సమానమని మన పురాణాలు ఘోషిస్తున్నాయి



కదా! తమరు ఎటువంటి సంకోచము లేకుండా మా ఇంటిలో తప్పక ఉండవలసినది అని ఆ వృద్ధ బ్రాహ్మణుని లోనికి తీసుకొనివచ్చి సపర్యలు గావించాడు.

ఆ రోజు మధ్యాహ్నం భోజనానంతరము ఆ వృద్ధ బ్రాహ్మణుడు తారామతితో ఇలా అన్నాడు. "ఏమమ్మా! దిగాలుగా వున్నావు. ఏమిటీ! నీ బాధ! ఏమీ సంకోచించకుండా చెప్పు" అన్నాడు. అందులకు తారామతి "స్వామీ! తమరు మహా తపస్సంపన్నులు, తేజస్సులో సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుని మాదిరిగా వున్నారు. మీ వద్ద దాచడానికి ఏమున్నది. నా మనోవ్యథంతా నా బిడ్డల వివాహము గురించి మాత్రమే అని విన్నవించింది. అంతట ఆ విప్రోత్తముడు చిరునవ్వు నవ్వి, "తల్లీ! నీ బాధ నేను గ్రహించితిని. నీ కష్టములన్నీ తొలగిపోయి కుమార్తెలకు శుభప్రదముగా వివాహము కాగలుగుటకు ఒక అద్భుత వ్రతము మీకు చెప్పెదను. ఈ వ్రతము ఆచరించిన మీ కష్టములన్నీ ఈడేరి, భోగభాగ్యములతో తులతూగెదరు. శ్రీవేంకటేశ్వర వ్రతము అను ఈ వ్రతము మిక్కిలి సులభతరము అని చెప్పి ఆ వ్రతవిధాన మంతయూ ఆ దంపతులకు వివరించాడు.

అంతట విష్ణుచిత్తుడు "స్వామీ! మహాసంతోషం. ఇంతకు మించి మహాభాగ్యం ఏముంటుంది? ఎన్నో రోజులు ఎందుకు? శుభస్య శీఘ్రం అన్నారు గదా! మన పెద్దలు. ఈ రోజు మాఘపౌర్ణమి. ఎంతో శుభదినము. ఈ రోజే తమరు సెలవిచ్చిన శ్రీవేంకటేశ్వర వ్రతమును ఆచరించెదము అని విష్ణుచిత్తులు, తారామతి దంపతులు తమ కుమార్తెలందరితో కలిసి ఆ రోజు సాయంకాలముననే బంధుమిత్రులను ఆహ్వానించి శ్రీవేంకటేశ్వర వ్రతమును అత్యంత భక్తిశ్రద్ధలతో యథాశక్తి ఆచరించారు. వచ్చిన భక్తులందరూ వ్రతము పూర్తయిన పిమ్మట తీర్థప్రసాదములు స్వీకరించి తమ తమ గృహములకు వెడలిరి. అప్పుడు విష్ణుచిత్తులవారు, భార్యా సమేతముగా ఆ బ్రాహ్మణోత్తమునికి పాద నమస్కారము కావించి, తమ దంపతులను ఆశీర్వదించవలసిందిగా వేడుకొన్నారు. అప్పుడా బ్రాహ్మణోత్తముడు వ్రత తీర్థ ప్రసాదములు తానూ స్వీకరించి, "మనోభీష్ట ఫలసిద్ధిరస్తు, శ్రీలక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు" అని ఆశీర్వదించాడు.

ఇంతలో చీకటిపడి నిద్రా సమయమైనది. అంతలో విష్ణుచిత్తుడు ఆ బ్రాహ్మణునికి ఒక చిరగిన దుప్పటిని ఇచ్చి కన్నీళ్ళ పర్యంతముగా "స్వామీ! కడు పేదనైన నా వద్ద ఇంతకుమించి మంచి దుప్పటిలేదు. ఈ రాత్రికి నన్ను క్షమించి దీనియందే విశ్రమించవలసింది" అని వేడుకొన్నాడు.

అందుకు ఆ బ్రాహ్మణుడు చిరునవ్వు నవ్వి, విష్ణుచిత్తునితో "నీవు ఏమీ చింతించవలదు" అని చెప్పి తను బయట వసారాలో పడుకుంటానని చెప్పాడు. కొద్దిసేపటికే అందరూ నిద్రకు ఉపక్రమించారు.

రాత్రి నాలుగోఝామున ఉరుములు, మెరుపులతో పెద్ద వర్షం మొదలైంది. ఎటు చూసినా కటికచీకటి. గాఢాంధకారంలో కంటికి ఏమీ కానరావట్లేదు. విష్ణుచిత్తునికి బయట పడుకున్న ఆ ముసలి బ్రాహ్మణుడు ఎలా ఉన్నాడో అని బెంగగా ఉంది. కానీ ఈ గాఢాంధకారంలో ఏమీ కనిపించక ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఆ రాత్రి ఎలాగో గడిపారు ఆ కుటుంబమంతా. ఇంతలో తెల్లవారింది. వాన తేలిక పడింది. బయట బ్రాహ్మణుడు ఏమైనాడో, ఎంత బాధపడ్డాడో అనుకుంటూ బయటకు వచ్చిన ఆ దంపతులకు అద్భుత దృశ్యం కనిపించింది. అక్కడ విప్రోత్తముడు లేడు. చిరిగిన దుప్పటి స్థానంలో పట్టుపీతాంబరం ఉంది. ఆ పీతాంబరంపై 'శ్రీవేంకటేశ్వర స్వామివారి విగ్రహం చిరునవ్వుతో కనిపించింది. జరిగినదంతా ఆ దంపతులకు అర్థమైంది. వారి ఆనందానికి అవధులు లేవు. వచ్చింది సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణుడే! ... ఆహా! ఏమి మన భాగ్యము. ఎన్నో జన్మల పుణ్యఫలము. కానీ ఆ స్వామివారిని గ్రహించలేకపోతిమే! చివరికి చినిగిన దుప్పటి ఇచ్చామే అని తలుస్తూ శ్రీస్వామివారి విగ్రహాన్ని కళ్ళకద్దుకొని ఇంట్లోకి వచ్చారు. ఇల్లంతా స్వర్ణమయంగా కన్పించింది. అంతటా ధనరాశులే! ఆహా! శ్రీవేంకటేశ్వరస్వామి వారి వ్రతకల్ప మాహాత్మ్యము వలన గదా ఇదంతయూ జరిగినది అని ఆ స్వామిని అనేకవిధాల స్తుతించారు.

చూశారా! సాక్షాత్తూ స్వామివారే ఆ భక్తుని ఇంటికి అతిథిరూపంలో వచ్చి వ్రతవిధానము చెప్పడమే కాకుండా తీర్థప్రసాదాలు కూడా తానే స్వయంగా స్వీకరించాడు. శ్రీస్వామివారు అంతటి కరుణామయుడు. ఎవరైతే భక్తిశ్రద్ధలతో ఈ వ్రతము ఆచరిస్తారో వారింటికి తానే స్వయంగా ఏదో రూపంలో తప్పక వస్తాడు. మీరందరూ కూడా ఈ వ్రతాన్నే ఆచరించి స్వామివారి కరుణాకటాక్షాలు పొందండి. "శ్రీ లక్ష్మీ శ్రీనివాస కటాక్ష సిద్ధిరస్తు'' అని విశ్వామిత్రులవారు సెలవిచ్చారు.

గోవిందా... గోవిందా... గోవిందా...

**॥ ద్వితీయ అధ్యాయము సమాప్తము ॥**

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥





# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## -: తృతీయ అధ్యాయము :-

## శ్రీ వశిష్ఠ ఉవాచ

ఈ అధ్యాయాన్ని మహా తపోనిష్ఠా గరిష్ఠులైన శ్రీవశిష్ఠ మునీంద్రులవారు శ్రీమన్నారాయణులవారి అనుగ్రహంతో మనకు వివరించారు. "ఓ కలియుగ వాసులారా! శ్రీనివాసుని ప్రియభక్తులారా! వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణుడే నేటి తిరుమల శ్రీవేంకటేశ్వరుడు. కలియుగవాసులైన మీ అందరి కష్టాలనూ గట్టెక్కించడానికి స్వామి మీకు అతి చేరువలో ఈ తిరుమలకొండపై అవతరించారు. ఆ స్వామివారిని ప్రసన్నం చేసుకొనడానికి ఈ వ్రతం మిక్కిలి సులభతరం. ఈ వ్రతం భక్తిశ్రద్ధలతో ఆచరించినవారు సకలసౌభాగ్యాలనూ అనుభవిస్తారు.

పూర్వకాలంలో అవంతీదేశంలో భాగ్యనగరమనే పట్టణం వుండేది. పేరుకు తగినట్లుగానే ఆ పట్టణంలో భాగ్యవంతులకు కొదువలేదు. అయితే వారు తమ తమ సంపదలను చూసుకొని గర్విస్తూ మిగిలిన సామాన్యులను అతి హీనంగా చూసేవారు. ఆ ఐశ్వర్యమంతా తమ గొప్పేనని తలుస్తూ నిత్యపూజలు కాదుగదా, విశేష రోజులలో కూడా ఏ పూజలూ చేసేవారుకాదు. అప్పుడు శ్రీమన్నారాయణునికి వీరందరికీ జ్ఞానోదయం కలిగించాలని తోచింది.

ఒకరోజున ఆ ధనవంతులందరూ విందువినోదాలలో మునిగితేలుతున్నారు. ఆ పట్టణ తూర్పువీధిలోగల శ్రీలక్ష్మీనారాయణ ఆలయంలో కనీసం దీపం వెలిగించేనాథుడు కూడా కరువయ్యారు. ఆ రోజు తొలి ఏకాదశి అత్యంత పర్వదినం. కానీ ఆ పట్టణంలో ఒక్కరు కూడా ఆ ఆలయానికి పూజాదికాలు నిర్వర్తించాలని ఆలోచించలేదు. సాయంత్రం ఉన్నట్టుండి దట్టమైన మబ్బులు కమ్ముకున్నాయి. బ్రహ్మాండమైన కుంభవృష్టి. వ్యాపారులందరి ఇళ్ళూ నీట మునిగిపోసాగాయి. అంతా గాఢాంధకారం. తెల్లవారేసరికి ఊరంతా నేలమట్టమయింది. వ్యాపారుల ఇళ్ళన్నీ కూలిపోయాయి. ఐశ్వర్యాలన్నీ పోయి చివరికి కట్టుబట్టలతో మిగిలారు. ఎందుకీ ఉపద్రవం... ఎందుకీ జలప్రళయం... ఎవరికీ అంతుబట్టలేదు. అంతలో వారికొక విశేషం కనిపించింది. ఊరి చివరన ఉండే పూరిపాకలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. వారికి ఆశ్చర్యం కలిగించింది. ఇంత కుంభవృష్టిలోనూ ఈ

పూరిపాకలు ఎలా ఉన్నాయి? అని వారిలో వారు అనుకుంటూండగా ఇంతలో ఒక పెద్ద మెరుపు మెరిసింది. ఆకాశవాణి ఇలా పలికింది.

"ఓ మూర్ఖులారా! మీ సంపదలన్నీ మీ గొప్పతనమని భావిస్తుండడంవల్లనే ఇలా జరిగింది. ఆ పూరిగుడిసెలో నివసించే దేవయ్య నాకు ప్రియభక్తుడు. అతి సామాన్యుడైన దేవయ్య ప్రతిరోజూ మీ ఊరిలోని శ్రీలక్ష్మీనారాయణ ఆలయంలో దీపం వెలిగిస్తున్నాడు. అంతేకాక ప్రతీ ఏకాదశినాడు తనకు వీలున్నంతలో శ్రీవేంకటేశ్వర వ్రతకల్పాన్నీ నిర్వర్తిస్తున్నాడు. ఆ వ్రత ఫలితంగానే తనతోపాటే ఆ గుడిసెలలోని వారందరూ రక్షింపబడ్డారు. మీరందరూ కూడా ఆ వ్రతం ఆచరించిన యెడల మీ మీ ఐశ్వర్యాలను తిరిగి పొందగలరు' అని వినిపించింది. వెంటనే వారందరూ ఆ ఆలయానికి వెళ్ళి తక్షణమే అందరూ తలొక పనికీ పూనుకొని శ్రీవేంకటేశ్వర వ్రతకల్పాన్ని ఆచరించారు. ఆ వ్రత ఫలితంగా అందరి గృహాలూ పూర్వరూపంలో కనిపించాయి. అది మొదలుగా ఆ వర్తకులందరూ శ్రీవారి భక్తులై ప్రతీ ఏకాదశినాడు శ్రీవేంకటేశ్వర వ్రతకల్పాన్ని ఆచరిస్తూ బ్రతికినంతకాలం సుఖసౌభాగ్యాలతో ఉండి చివరికి ముక్తిని పొందారు" అని శ్రీవశిష్టులవారు వివరించారు.

గోవిందా... గోవిందా... గోవిందా...

**॥ తృతీయోధ్యాయము సమాప్తము ॥**

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥





# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## -: చతుర్థ అధ్యాయము :-

## శ్రీ భరద్వాజ ఉవాచ

శ్రీమన్నారాయణునికి అత్యంత ప్రీతికరమైనటువంటి ఈ "శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము" లోని నాలుగవ అధ్యాయాన్ని మహామునీశ్వరులు శ్రీభరద్వాజ మహర్షులవారు ఈ విధంగా చెపుతున్నారు. "ఓ కలియుగవాసులారా! శ్రీమన్నారాయణ ప్రియభక్తులారా! మీరు ఆచరిస్తున్నటువంటి శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము అద్భుతమైనది. మీ కోరికలన్నింటినీ తక్షణమే తీర్చగల ఉపాయము, శ్రీవేంకటేశ్వరుని ప్రసన్నం చేసుకోవడానికి అత్యంత సులభతరమార్గము ఇదియే. మీ అందరినీ అనుగ్రహించడానికి సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుడే కలియుగంలో తిరుమలకొండపై శ్రీనివాసునిగా అవతరించారు. ఎన్నోజన్మల పుణ్యఫలం చేతగానీ తిరుమల కొండపై కాలుమోపడం సాధ్యంకాదు. స్వామి దర్శనము లభించదు. ఇదేవిధంగా ఈ "శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము" ఆచరించే సంకల్పము కలుగుట కూడా ఎంతో పూర్వజన్మ పుణ్యఫలమువలననే సాధ్యము. ఆచరిస్తున్నవారూ, కథలు విన్నవారూ, ప్రసాదము స్వీకరించినవారూ శ్రీవారి కృపకు పాత్రులై ఎంతో మహాభాగ్యము పొందుదురు.

పూర్వకాలమున 'నగరి' అనే గ్రామములో ధనగుప్తుడనే వ్యాపారి నివసించేవాడు. అతడు పరమలోభి. ఎంత ధనము సంపాదించిననూ అతని లోభితనమునకు అంతు లేకుండెను. ఈ ఐశ్వర్యమంతయూ తన గొప్పేననే భ్రమలో కొట్టుమిట్టాడేవాడు. ఎంతటి వారినయిననూ ఈ అహంకారమే గదా అథఃపాతాళానికి అణగద్రొక్కేది.

ధనగుప్తుని భార్య కాంతిమతి మాత్రం ఎంతో భక్తిశ్రద్ధలు కలిగియుండెను. వారికి ముగ్గురు పుత్రికలు. చివరి పుత్రికైన 'కుమారి'కి దైవభక్తి ఎక్కువగా వుండేది. ఎల్లప్పుడూ ఆ శ్రీనివాసునే తలుస్తూ వుండేది.

తండ్రికి తెలియకుండా వీలున్నప్పుడల్లా శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయానికి వెళ్ళి స్వామిని దర్శించుకొని వస్తుండేది. ఇంటికి తీసుకువచ్చిన ప్రసాదాన్ని అందరూ స్వీకరించినా తండ్రి మాత్రం ఎప్పుడూ తీసుకొనేవాడు కాదు. భర్తయొక్క ఈ ప్రవర్తనకు కాంతిమతి మిక్కిలి చింతించెడిది.

ఒకరోజు 'కుమారి' తన స్నేహితుల ఇంట "శ్రీవేంకటేశ్వర వ్రతము" జరుగుతున్నదని తెలుసుకొని తాను కూడా వ్రతకథలను విందామని వెళ్లింది. వ్రతమూ పూర్తయ్యేసరికి మిట్టమధ్యాహ్న మయింది. ప్రసాదం తాను స్వీకరించి కొంచెము పొట్లముగా కట్టించుకొని ఇంటికి బయలుదేరింది. మార్గమధ్యమునకు వచ్చేసరికి ఎండ తీవ్రత ఎక్కువైంది. ఎక్కడైనా కొంచెము దాహం తీర్చుకుందామని తలచగానే ఆ పక్కవీధిలోనే తన తండ్రి అంగడి ఉందని గుర్తొచ్చింది. ఆ అంగడికి వెళ్ళి ఈ వ్రతము గురించి తండ్రికి చెప్పకుండా నీళ్ళు అడిగి తాగింది. తండ్రి కోపగించుకుంటాడనే భయంతో కంగారుగా దాహం తీర్చుకొని వడివడిగా ఇంటిదారి పట్టింది. ఈ హడావిడిలో కుమారి ప్రసాదం పొట్లం దుకాణంలోనే మర్చిపోయి వదలి వెళ్ళిపోయింది.

ఇంతలో ఆ బజారులో ఒక్కసారిగా అలజడి మొదలైంది. ప్రజలందరూ హాహాకారాలు చేస్తూ పరుగులు పెడుతున్నారు. పెద్ద అగ్నిప్రమాదం సంభవించి ఆ వీధిలోని దుకాణాలన్నీ అగ్నిదేవుని ప్రతాపానికి ఆహుతి కాసాగాయి. అసలే మిట్టమధ్యాహ్నం. దానికితోడు తీవ్రమైన వడగాలి. ధనగుప్తుడి శరీరం భయంతో కంపించింది. ఇంకొద్ది క్షణాలలో తన కళ్ళెదుటే తన దుకాణం కూడా బూడిద కావలసిందే. ఈ ఆలోచనతో చేతులు వణికిపోతున్నాయి. దుకాణం నుంచి అందరూ బయటకు పరుగులుతీసారు. కాని తాను మాత్రం అట్లే ఉండిపోయాడు. విడిచిపోబుద్ధి కావట్లేదతనికి. ఉంటే తాను కూడా మసైపోగలడు. ఈ కంగారులో చేతికి ఏదో పొట్లం తగిలింది. ఏ ఆలోచనా లేకుండా తీసి నోట్లో వేసుకున్నాడు. తియ్యగా అనిపించింది. అంతేకాదు, మనస్సు కొంచెం స్థిమితపడ్డట్టు కూడా తోచిందతనికి.

అప్పుడే ఒక అద్భుత సంఘటన జరిగింది. మంటలన్నీ ధనగుప్తుడి ముందు దుకాణంవద్దే ఆగిపోయాయి. ఒక్క నిప్పురవ్వ కూడా తన దుకాణంపై పడలేదు. ఏమిటీ విచిత్రం. ఏమిటీ మాయ. ధనగుప్తుడికి నోటమాటరావట్లేదు. ఇంతలో ఈ వీధిలో అగ్ని ప్రమాదం జరిగిందని తెలిసి భార్య కాంతిమతి, కుమార్తెలతో సహా భయాందోళనలతో ఆ శ్రీనివాసుణ్ణే ప్రార్థిస్తూ అక్కడికి వచ్చారు. దుకాణంవరకూ వచ్చిన మంటలు పక్కనే ఉన్న అంగడివద్దే ఆగిపోవడం చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు. అప్పుడు కుమార్తెకు తాను దుకాణంలో మరిచిన పొట్లం గుర్తుకు వచ్చింది. ధనగుప్తుడు అంతకుముందు తాను తిన్నదీ, ఆ పొట్లంలోనే పదార్థంగా గ్రహించాడు. కుమారి ఆ పొట్లం శ్రీవేంకటేశ్వర స్వామివారి ప్రసాదం అనీ, తాను వ్రతంలో పాల్గొనటం అంతా వివరించింది. తాను స్వీకరించిన ఆ ప్రసాద మాహాత్మ్యంవల్లనే తానా ప్రమాదం నుంచి బయటపడినట్లు



ధనగుప్తుడు గ్రహించాడు.

శ్రీవారిని క్షమించమని చెంపలు వేసుకున్నాడు. సాయంకాలమే ఊరివారందరినీ పిలిచి 'శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము' భక్తిశ్రద్ధలతో ఆచరించాడు. అప్పటినుంచీ ఆ వర్తకుడు పూర్తిగా స్వామివారి సేవలకే తన శేషజీవితాన్నంతా గడిపి ముక్తిని పొందాడు.

కేవలం ప్రసాదాన్ని స్వీకరించినంతనే ఎంత ఆపదనుంచి బయటపడ్డాడో చూశారు గదా! ఈ వేంకటేశ్వర వ్రతమాహాత్మ్యము అంతటి అద్భుతమైనది. మీరందరూ వీలున్నప్పుడల్లా ఈ వ్రతాన్ని ఆచరించి శ్రీనివాసుని కృపకు పాత్రులు కావలసింది" అని భరద్వాజులవారు అనుగ్రహించారు.

గోవిందా... గోవిందా... గోవిందా...

**॥ చతుర్థోధ్యాయము సమాప్తము ॥**

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥



# శ్రీ వేంకటేశ్వర వ్రతకల్పము

## -: పంచమ అధ్యాయము :-

## శ్రీ అత్రి ఉవాచ

భూలోక వైకుంఠమే తిరుమల తిరుపతి. తిరుమలతో సమానమైన పవిత్ర ప్రదేశంగానీ, శ్రీవేంకటేశ్వరునితో సమానమైన దైవంగానీ ఇంతకుముందు లేడనీ, ఇకముందు ఉండబోడనీ పురాణాలు ఘోషిస్తున్నాయి. శ్రీనివాసునిగా వెలసిన శ్రీమన్నారాయణునికి తన భక్తులకంటే అలవిమాలిన ప్రేమ. ఎవరైతే తనమీదే పూర్తి భారంవేసి, నిత్యం తననే స్మరిస్తూ, సత్ప్రవర్తన కలిగి జీవిస్తారో వారి యోగక్షేమాలు తానే వహిస్తాడు. అంతటి దివ్యదేవుని ప్రసన్నం చేసుకొనటానికి అత్యంత సులభతరమైన మార్గం ఈ శ్రీవేంకటేశ్వర వ్రతకల్పము.

ఈ అద్భుత వ్రతకల్పంలోని అయిదవ అధ్యాయాన్ని మహా తపఃస్సంపన్నులైన శ్రీ అత్రి మహర్షులవారు ఇలా అనుగ్రహించారు. "నాయనలారా! శ్రీనివాసుని ప్రియభక్తులారా! కలియుగవాసులైన మీ అదృష్టం చెప్పనలవికానిది. కృత, త్రేతా, ద్వాపర యుగాలలో ఎంతో కఠోర నియమ నిష్ఠలతో ఆరాధిస్తేగానీ ప్రసన్నం కాని శ్రీమన్నారాయణుడు కలియుగంలో కేవలం నామస్మరణతోనే మిమ్మల్ని అనుగ్రహిస్తున్నాడు. ఆర్తితో పిలిచిన వారి చెంత తక్షణం ఉంటాడు. అంతటి కరుణామూర్తి శ్రీనివాసుడు. తిరుమల క్షేత్రమంతా సాలగ్రామమయమే! ఆ పవిత్ర కొండపై మీరు వేసే ప్రతి అడుగూ ఎన్నోజన్మల పుణ్యఫలం.

పూర్వకాలంలో కౌమారదేశంలో 'మిత్రుడు' అనే చాకలివాడు ఉండేవాడు. అతడు తన కులవృత్తిని నిర్వర్తిస్తూ వీలున్నంతలో దానధర్మాలు గావిస్తూ ధర్మపరంగా జీవిస్తుండేవాడు. కాని అతడి దిగులంతా అతనికున్న అవిటితనమే. కాలు అవిటిది కావడంచేత ఉతికిన బట్టలను మూటలు కట్టి ఇంటింటికీ తిరిగి ఇవ్వటం చాలా కష్టంగా ఉండేది. దానికి తోడు గంపెడు సంసారం. కష్టపడకపోతే పూట గడవదు. ఎల్లప్పుడూ ఆ శ్రీనివాసునే ప్రార్థిస్తూ ఉండేవాడు. ఏదో ఒకరోజున ఆ స్వామి తనను కరుణిస్తాడన్న నమ్మకంతో జీవనం సాగిస్తున్నాడు. భక్తజన సులభుడైన శ్రీమన్నారాయణుడు ఇదంతా గమనిస్తూనే ఉన్నారు. ఎవ్వరికైనా వారి పూర్వజన్మ కర్మ నివృత్తి అయ్యే సమయానికి శ్రీనివాసుడే ఏదోరూపంలో వచ్చి తన భక్తులను తప్పక ఆదుకుంటాడు.



ఒకరోజు సాయంకాలంనాడు ఎప్పటిలాగే మిత్రుడు చాకిరేవు నుండి బట్టలమూటతో పట్టణానికి రోజుతూ, రొప్పుతూ తిరిగి వస్తున్నాడు. ఇంతలో మార్గమధ్యంలో వాడికి ఒక ముసలి బ్రాహ్మణుడు తారసిల్లాడు. సహజంగా భక్తిశ్రద్ధలు కలవాడు అవడంచేత మిత్రుడు భుజంమీద మూటలు క్రింద పెట్టి ఆ బ్రాహ్మణునికి నమస్కరించాడు. అంతట ఆ విప్రోత్తముడు 'నాయనా! ఈ అవిటికాలితో ఎంతో బాధపడుతున్నావు. నీ బాధ చూడటానికే కష్టంగా ఉంది. నువ్వెంత కష్టపడుతున్నావో కదా!' అని అన్నాడు. అప్పుడు మిత్రుడు స్వామీ! మీరెవరో మహానుభావులు లాగా ఉన్నారు. గంపెడు సంసారభారంచేత నాకీపని తప్పటంలేదు. ఈ అవిటితనం పోయేమార్గం ఏదైనా సెలవియ్యవలసింది' అని విన్నవించుకున్నాడు.

అప్పుడు ఆ ముసలి బ్రాహ్మణుడు 'నాయనా! తప్పక చెపుతాను. సావధానంగా విను. నీ అవిటితనం పోవడమే కాకుండా నీకు అష్టైశ్వర్యాలు కలిగే వ్రతం ఒకటి చెపుతాను. వ్రతం ఆచరించిన మరుక్షణమే నీకు వెయ్యి వరహాలు లభిస్తాయి. అయితే ఒక షరతు. అందులో సగం నాకు సమర్పించాలి. రేపు మళ్ళీ ఇదే సమయానికి ఇక్కడికి వస్తాను' అని చెప్పాడు.

అప్పుడు మిత్రుడు 'స్వామీ! ఇంతకు మించిన మహాభాగ్యం ఏముంటుంది! ఆ వ్రతమేదో ఈ రోజే ఆచరిస్తాను' సెలవియ్యండి! అని ప్రార్థించగా ఆ బ్రాహ్మణుడు 'శ్రీవేంకటేశ్వర వ్రతకల్పం'ను వివరంగా చెప్పాడు.

మిత్రుడు రెట్టించిన ఉత్సాహంతో ఇంటికివచ్చి ఈ విషయమంతా భార్యకు చెప్పి ఇరుగుపొరుగులవారిని ఆహ్వానించి శ్రీవేంకటేశ్వర వ్రతాన్ని ఆచరించి తీర్థప్రసాదాలు తాను స్వీకరించి వచ్చినవారందరికీ పంచాడు. ఇంతలో ఇంటిబయట ఏదో కోలాహలం వినపడింది. మిత్రుడి కుమారుడు బయటనుంచి ఇంట్లోకి పరుగుపరుగున వచ్చి 'అయ్యా! రాజభటులు నీకోసం వచ్చారు. రాజుగారు నీకు కట్నకానుకలు పంపించారట' అన్నాడు. ఇంతలో రాజభటులు వచ్చి మిత్రుడిని రాజుగారి ఆస్థానంలో చాకలిగా నియమించారనీ వెయ్యివరహాలు బహుమానంగా పంపారని చెప్పి మిత్రుడి చేతిలో వేయి వరహాలమూట పెట్టారు. ఒకవారంలోపల వచ్చి రాజుగారి కొలువులో చేరవలసిందని చెప్పారు. మిత్రుడి ఆనందానికి అవధులులేవు. వారందాకా ఎందుకు, రేపే వెళ్ళాలి అని మూట, ముల్లె సర్దుకొని మరుసటిరోజు తెల్లవారుఝామునే ప్రయాణమయ్యాడు. ఈ ఆనందంలో ఆ ముసలి బ్రాహ్మడి సంగతే మరచిపోయాడు. మార్గమధ్యంలో గుర్తుకురాగా ఒక నెల తర్వాత

కలవవచ్చులే అనుకొన్నాడు. వెళ్ళి రాజాస్థానంలో చేరాడు. రోజులు, నెలలు గడుస్తున్నాయి. ఆ బ్రాహ్మడికిచ్చిన మాట పూర్తిగా మరచిపోయాడు. అంతే బ్రాహ్మణరూపంలో వచ్చిన ఆ స్వామివారికి కోపం వచ్చింది. మానవనైజం అంతేనని అనుకున్నారు శ్రీస్వామివారు. తన మాహాత్మ్యం తెలియచెప్పాలని నిర్ణయించుకున్నాడు.

అంతే ఆ మరునాడే రాజాస్థానంలోని రాణిగారి నగలు మాయమయ్యాయి. ఆ అభాండం మిత్రుడిమీద పడింది.

మిత్రుడికి కఠినకారాగార శిక్ష పడింది. రాజభటులు మిత్రుడిని పలువిధాల శిక్షించారు. ఎందుకిలా జరిగింది. ఎందుకీ అభాండం తనమీద పడింది అని తలుస్తున్న మిత్రుడికి ఆ రాత్రి స్వామివారు కలలో కనపడి వృద్ధ బ్రాహ్మడిరూపంలో వచ్చినది తానేననీ, తనకిచ్చినమాట నిలబెట్టుకోకపోవడంచేతనే ఇలా జరిగిందనీ చెప్పారు. అప్పుడు మిత్రుడు 'స్వామీ! నేను మిక్కిలి పాపాత్ముడిని'. ఎంతటి అపరాధం చేశాను. దయచేసి నన్ను కరుణించండి. ఇకమీదట తప్పక ప్రతీనెలా మీ వ్రతం ఆచరిస్తాను. నా సంపాదనలో సగభాగం ప్రతీనెలా జీవితాంతం తమకే సమర్పిస్తాను' అని చెంపలు వేసుకొని స్వామివారిని పరిపరివిధాల వేడుకొన్నాడు. భక్తజన బాంధవుడైన స్వామివారు అందుకు సంతోషించి మిత్రుడిని అనుగ్రహించాడు. శ్రీవారి అనుగ్రహంచేత రాణి నగలు వేరే ప్రదేశంలో మరుసటిరోజే దొరికినవి. మిత్రుడు దొంగిలించలేదని రాజు గ్రహించడం జరిగింది. మిత్రుడిని కారాగారం నుంచి వదలివేశారు. అప్పటినుంచీ మిత్రుడు స్వామివారికిచ్చిన మాట ప్రకారం ప్రతీనెలా 'శ్రీవేంకటేశ్వర వ్రతం' ఆచరిస్తూ తన సంపాదనలో సగభాగం స్వామివారికే సమర్పిస్తూ కలకాలం సుఖంగా జీవించి చివరన ముక్తిని పొందాడు'' అని అత్రిమహర్షులవారు సెలవిచ్చారు.

గోవిందా... గోవిందా... గోవిందా...

**॥ పంచమోధ్యాయము సమాప్తము ॥**

శ్రియః కాంతాయ కళ్యాణ నిధయే నిధయేర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

